A 7-21

# శ్రీ రామ కథా లహరి



అయోధ్యాకాండము

## మూడు భాగములు

అభినవలీలాశుక



బ్రహ్మశ్రీ కొమ్మూర్తి బాలబ్రహ్మానందదాసుగారిచే

రచియింపఁబడి

బ్రహ్మశ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే

పరిష్కరింపఁబడి

శ్రీయుత పి. సుందరరాజునాయఁడు

(మెకానికల్ యింజనీయరు) గారికి

అంకితమీయఁబడినది.



కాపీరైటు

Title Page Printed at Sree Vani Press, Rajahmundry.

శ్రీరస్తు.

# శ్రీ రామ కథా లహరి

అయోధ్యా కాండము

మూడు భాగములు

ఇది

బాలకళానిధి

బ్రిహ్మశ్రీ కొమ్మూరి బాలబ్రహ్మానందదాసుగారిచే

రచియింపఁబడి,

బ్రిహ్మశ్రీ కవిసార్వభౌమ, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారిచే

పరిష్కరింపఁబడి

శ్రీ పగిడిపాటి సుందరరాజు నాయఁడు

(మెకానికల్ ఇంజనేయరు) గారికి

అంకితమీయఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు

రాజమహేంద్రవరము

శ్రీ లలితా ముద్రాలయమునందు ముద్రితము

1935

కాపీరైటు]

[వెల 0—8—0

D

శతావధాని శ్రీయుత పింజల సుబ్రహ్మణ్యకవిగారాశువుగా
చదివిన యభినందన పద్య పంచకము.

---

శ్లో॥ కొమ్మూరి కులోద్భూతం । గానశాస్త్రవిశారదం
బ్రహ్మానంద కవి శ్రేష్ఠం । పాయాత్ శ్రీపార్వతీశ్వరః॥

చ. పసిఁడికి తావియుం, జెఱుకుపండ్లును, చందన భూజపుష్పముల్
పసదనరారఁ గూర్పఁగలభాగ్యము నొందఁగలేని బ్రహ్మతా
న సదృశసాహితీ పటిమనంచితగాన విశేషయుక్తి మీ
కొసఁగుటచేత సద్యశమునొంది యపార మహత్వమందెడిన్.

చ. అనుపమమైన హాస్యవచనావళిచేత మనోహరంబుగా
దనరెడు నృత్యపాండితి సుధారకవిత్వ కళానుభూతిచే
జనసముదాయమెల్లఁ దమస్వాంతమునం బరిపూర్ణసంతసం
బునుగని హాయిహాయియను పోల్కిఁగథన్ వచియించితౌభళీ.

క. పలువురు హరిదాసులమని
పలుకుచు నిజగౌరవంబు వర్ణింతురు తా
మిలనిట్టి మహాచతురత
యలవడునే దైవకృప రవంతయులేకన్.

క. సభలందు చతురచనా
విభవము సంగీతగరిమ వెలయఁగ నెపుడున్
'అభినవలీలాశుక!' నీ
వుభయగతుల జనులఁ దన్పుచుందువుగాతన్.

ఇట్లు
(శతావధాని) పింజల సుబ్రహ్మణ్యం
వేటపాలెము

7-21

శ్రీ వేమన గ్రంథాలయము



అభినవలీలాశుక

బ్రహ్మశ్రీ కొమ్మూరి బాలబ్రహ్మానందదాసుగారు



మహారాజశ్రీ పి. సుందరరాజనాయనుగారు,
మెకానికల్ ఇంజనీయరు,
హైదరాబాదు టంకశాల.

# అంకితము

ఉ. శ్రీయును వాణియున్ శివయుఁ జిత్తములందున సంతసించియీయా
ధీయుత నిన్ను, నీసతిని, తీయనిమాటలనాడు నీసుతున్
బాయని ప్రేమతో సకలసౌభాగ్యము, లాయువు, వృద్ధిచేసి మేల్
సేయుచునుండ్రు కాకయని చేసెద సన్నుతివారి నెప్పుడున్.

ఉ. ఈతఁడు పేద, వీఁడు గుణహీనుఁడు, వీఁడొక నీచవర్ణ సం
జాతుఁడు, వీఁడు రోగి, చెడుసత్వుడు నా కితఁడంచు వేనిపైఁ
బ్రీతినిఁ దప్పకెల్లరిఁ బ్రేముడిఁ జూచెడివాఁడ వీవు నీ
ఖ్యాతికి వన్నె వోవునె, సుఖంబున గూడఁ గనీశు సత్ప్రభూ.

ఉ. పాడియుఁ బంటయున్ గలిమి బాలుఁడుఁ దోటయు సేద్యభూమియున్
మేడయు వాహనంబుఁ దగు మిత్రులు బంధులు సేవకాళియున్
రేమలతోడి పొత్తును, ధరిత్రిజనంబులు మేలటంచుఁ గొం
డాడెడు కొల్వు నీకె సరియయ్యె నొరుల్ నినుబోల నేర్తురే.

ఆ. జనకుఁడచ్యుతుండు జనని తాయారమ్మ
యెన్ని సుకృతములను నిన్నుఁ గనిరొ
ధవుగ నిన్నుఁ గొన్న తరుణి యాండాళ్ళమ్మ
పుణ్యమేమొ వారి పొగడఁదరమె.

ఉ. ఎందరో పాదుకం గృతిగనిమ్మని కోరిరి, కాని వారలం
జెందక నిన్నుఁ బొందె గుణశేఖరుఁ డీవయియుండఁ బోలునా
డెందము సంతసించెడుఁ గడింది సుఖంబులఁ గొందువీవికన్
సుందరరాజ! నీసుతుఁడుఁ జూరగొనున్ ధనధాన్య సౌఖ్యముల్.

కొమ్మూరి బాలబ్రహ్మానందము

# అభిప్రాయము

చిరంజీవి బాలబ్రహ్మానంద మనేకసహోదరులు నా శిష్యులు శ్రీయుత పి. సుందరరాజునాయఁడు (మెకానికల్ యింజనీయరు)గారి సంగతియు, వారిమిత్రులు మా॥రా॥శ్రీ ఎ. సత్యనారాయణనాయుడు (మింటుకాంట్రాక్టి యర్) గారి సంగతియును జెప్పుచుందును. వీరిలో నీ యయోధ్యా కాండమునకుం గృతిపతియగు పి. సుందరరాజు నాయుడుగారు నెల 1కి 1000_0_0 వేయిరూప్యములు వేతనముఁగొను నుద్యోగియయ్యును, మిక్కిలి వినయసంపత్తియు, గురుభక్తియు నిత్యము దైవారాధనము, మొదలగుసద్గుణములతో విరాజిల్లుచుండునని వింటిని. అట్టివీరు మాబాల బ్రహ్మానందమును కోరి యీశ్రీరామకథాలహరికిఁ గృతిపతియైనందుల శ్రీరామచంద్రుఁడు వీరి నెంతయుఁ బ్రేమతో సర్వశుభంబుల నొసంగి కాపాడుఁగాక.

ఇట్లు

(కవిసార్వభౌమ) శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

## గురుస్తుతి.

తే. మొదట గానంబు మప్పిన వెదురుపర్తి
చిట్టి శాస్త్ర్యాఖ్యునకు నతిఁ జేతుఁ బిదప.
పోడిమి కథగరపిన గొండాడ వంశ
భూషణమగు సింహాచలమ్మను నుతింతు.

గ్రంథకర్త.





39413

శ్రీరస్తు

శ్రీరామకథాలహరి.

# శ్రీరామ పట్టభంగము



తే. వేలుపులకెల్ల వేలుపు విష్ణుమూర్తి
భక్తతతికెల్ల భక్తుఁడా పద్మనాభు
డట్టివానిని మది గొల్వ నఘములడఁగు
భక్తి నాతనిఁ గొల్వుఁడో ప్రాజ్ఞులార.

ఉ. కైకను కార్యసాధనముఖంబునఁ జెట్టిన మంథరన్ జనా
నీకముసేయు నిందలను నిందలుగా గణియింపఁబోక పెం
గాక వహించి రాఘవుని గానకుఁబంపిన కేకయాత్మజన్
లోకము నుద్ధరించిరని లోకులు చేతురుగాక సన్నుతుల్.

వ. వినుమో పార్వతీ పరశురాముని గర్వభంగమొనర్చిన యనంతరం
బా దాశరథు లయోధ్యానగరంబునం గృహప్రవేశమై సమస్తసౌ
ఖ్యంబు లనుభవించుచున్నయెడ యోగ్యులును, బుద్ధిబలసంపన్ను
లునగు తనపుత్రులగు వారిగుణగణంబులకు దశరథుఁడు మెచ్చు
[illegible] యొకనాఁడు భర
తుని మేనమామ [illegible] బంచి యుధాజిన్నగరంబునకు భరతశత్రు
ఘ్నులం గొని చనియె ననంతరం బొక్కనాఁడు దశరథుండు—

తే. హితులు సామంతులునుఁ బురోహితులు నతుల
వైభవముఁగల వైశ్యులుం బండితులును

అష్టమంత్రులుం గొల్వుండు నట్టితరిని
ననియె గురుఁడౌ వశిష్ఠుతో వినయమునను.

కాంభోజి—రూపకము.

ప॥ మునిచంద్రమ కౌశికఋణమును నెట్లులఁ దీర్తుమయ్య

అ॥ జనకునెడల భక్తి గంటె । ఘనమా మునియందుఁగల్గె ॥ము॥

చి॥ మునియగుటఁ మణులు భూము । లును నతనికి పనికిరావు

మనరామునిఁ దనసుతుగాఁ । గొనిన మహాభాగుఁడు కద ॥ము॥

చ॥ ఉపకారముఁ గోరక నా । కుత్తమవియ్యంకుం గూర్చె

తపసి యతనికే యుపకృతి । నెపుఁడు చేయఁగలము మనము

చి॥ తపసిరాయ ఋణముండుట । తప్పుకాదె రాజులమై

కృపతో నాలోచన నా । కిపుడు చెప్పు ధన్యుడగుదు ॥ము॥

వ. అనిన నాయరుంధతీప్రియుం డయోధ్యాప్రియుండగు దశరథున
కీ ట్లనియె.

ఝంఝూటి—త్రిశ్రగతి.

ప॥ నీకు ఋణముండియె తా । నీసుతులకుఁ బెండ్లిజేసె

అ॥ ఏకరణి యతని ఋణము ! నీకును నా కగును తీర్పఁగ॥

చ॥ రాముఁడు సామాన్యుఁ డగునె । రక్షకుండు లోకములకు

నా మహానుభావున కిది । యేమిలెక్క లెక్కింపంగ ॥నీ॥

వ. అను నమ్మునిశ్రేష్ఠునకు రాజశ్రేష్ఠుం డి ట్లనియె.

ఉ. సంతతికల్గు మార్గము వెసం దెలిపెం గద సూతుఁ డంత నా
వంతయు మాటఁదీయ కవి భండకపుత్రుఁడు పూర్తిఁజేసె నా
చింత తొలంగగా వ్రతము చిత్తము రంజిలఁగంటి పుత్రులఁ
సంతసమొంది కౌశికుఁడు సల్పెను వారల పెండ్లివేడుకల్.

క. సంతతి కలుగని నేనా
సంతతిఁగని సంతసిలకఁ జాలని మతినై

చింతనుఁ బొందుచు నుంటిని,
అంతము లేదేల చింత కనఘా యెపుడున్.

వ. తా మన్నట్లా విశ్వామిత్రుని ఋణముం దీర్పశక్యముకాదనియు నాచింత యుడుగవలెననియుం దోచుచున్నది కాని మరియొకచింత మాత్ర మున్నది.

ఉ. సంతతి కల్గునంతకును సంతతి లేదని కొంతచింత యా
సంతతికల్గ వారలకు సౌఖ్యముఁజేర్ప మరింతచింత యా
వంత దొరంగగా శుభము భాగ్యముఁ గూర్పగఁ గొంతచింత యీ
చింతలు తీరునే తుదకు జీవము చెల్లినదాక నున్నవే.

వశి— పాపము శమించుఁగాక.

దశ—నా కిప్పుడున్న సందేహము వినుఁడు.

మంజరులు.

౧॥ రాముసకు రాజ్యమీయ నామదిని । రాగము కల్గుచునుండె
రామరాజ్యమున నుండరాని ధ ॥ ర్మమునను వద్దనుచుండె॥

౨॥ సింహపీఠినున్న రాముజూడఁగ । జిత్తము తత్తరమందు
సింహపీఠి రామునుంచి యడవికిఁ జేరఁగ మది కాదందు॥

తే. ఎప్పుడైనను రామున కప్పగించి
రాజ్యమంతయు, నేను యాత్రల సలుపుచు
మూఁడవదగు నాశ్రమముచుఁ బొందవలదె
జరుపనెంతు నిప్పుడె కాని సాయమీంద్ర !

క. ధనదాశేషుణ పుత్రే
షణములలో రెండు విడిచితి సద్గుణగణ్యా!
తనయులవిడి యడవికి నే
జనలేకున్నాఁడ బుత్రసారం బేమో.

తే. అందు రాముని విడ మన మసలె కాదు
నేనె రాముఁడు రాముఁడే నేను దలఁప
ప్రేమతో రామునకు సింహపీఠి నిడక
జచ్చిపోయెద నని కల్గె సంశయంబు.

వ. సుతు నెడసి గతించినను హితకరమగు పని నెరవేర్చిన నాకును లోకమునకును సంతృప్తికరముగా నుండునని తలంతు నన సుమంతుండను మంత్రి దశరథమహారాజునకుం జోహారొనర్చి మహారాజా నామనవి వినుమని యిట్లు చెప్పం దొడంగె.

సీ. మనరాముఁడీ ధరామండలం బేలఁగా
కందు మెచ్చని జను లందఱయ్య
కప్పముల్ రాముని కప్పగించెదమని
యన్యదేశ నృపులెల్ల నందఱయ్య
మనజానకిని బట్టమహిషగా జూడఁగ
నగుటు లేదని కాంత లందఱయ్య
సింహాసనమున సీతాపతిని మేము
నుబలాటమునఁ జూడ నుంటిమయ్య

తే॥ రామరాజ్యమునుఁజూచెడు రాగగరిమ
నుర్విప్రజలు జీవించియుండిరయ్య
శుభముహూర్తము నెఱవేర్పఁజూడుమయ్య
సార్వభౌమునిగా రామునిలుపుమయ్య.

మంజరి

చెప్పంపుమానంబ్రి యిపుడే నే । బ్రజల యభిమతమువింటు
నప్పుడె నేఁడో రేపో రాముని । పట్టణనేలు కొమ్మందు.

వ. అనిన దశరథునిపల్కులకమందానంద కంపళిత హృదయారవిందుండై సుమంత్రుండు పురజనంబులం గొందఱ నన్యగ్రామవాసుల

రప్పించి దర్బారుకోలనం గూర్చుండనియోగింప నా సభామధ్యం బున దశరథుండు లేచి ప్రజలారా మనరాష్ట్రంబున కస్మత్పుత్రుం డగు శ్రీరాముని రాజుగాజేయ తామెల్లరకు నిష్టమేనా? "ప్రజా నుమతేరాజా" యను నార్యోక్తిననుసరించి మిమ్మడిగితిసన నందుం గొందఱు రాజుంగాంచి యిట్లనిరి.

జంఝూటి—చతురశ్ర.

ప॥ రాములవారే రాజైతేమన । రాజ్యమెల్ల బాగానుండును సీ॥
అ॥ ఈమయిపీ తమకన్న చులుపగ । నేలగలిగిన దీరుండే సీ॥ రా
చ॥ ఎంతట రామయ్య రాజగునోయని । యెల్లరము జూసుసుంటిమీ
చింతోసంబే మాకందరికి । చరగునం పట్టంగట్టండీ ॥సీరా॥
2॥ సీమాయిట్టే రాములవారని । సెపుతారండీ జనులంతా
మేమందరము ద్రోహతలాతా । మేవుందండీ లోటింకా॥
3॥ సూత్తాలేసిరా వొసిట్టుకోరు । చుబమువ్వూర్తం బెట్టండీ
జాప్తలోజులు బెట్టక వొయిదికే । శాదన్తం జోగొట్టండీ ॥సీ॥

క. అనినంత నాదశరథుండు
మినుముట్టెను తనువుపొంగ మేను గగుర్పా
ఇనవంశజలధి శశియగు
తనపుత్రుని మెచ్చుకొనియెందరుగని ప్రేమన్.

వ అట్లానందనిమగ్నుండై కొంతసేపటికి ప్రజలంగాంచి యార్యులారా మీయిష్టప్రకారమట్లే చేసెద శీఘ్రము ముహూర్తంబుం బెట్టిం చెదనన నచటిజనులెల్ల రానందంబున నింటకేగుటయుం దనపాత రము గురువగు వసిష్ఠుంగనుగొని యాదశరథుం డిట్లనియె.

శంకరాభరణము — ఆదితాళము.

ప॥ రాముని రాజుగ । నోమునిచేయుము శ్రీ॥
అ॥ ఈమహినెల్లరి । నేలెడిధీరుడు శ్రీ॥ రా

మి॥ ఓమహానుభావా యీకార్యం। బొడ్డెక్కనో లేదోయని సందియ
మేమొగానికల్గుచుండె నామది। కెట్టుల నెరవేర్తునో తోఁపదాయె॥

చ॥ ఏమికారణమొ నా। యెడమకన్నదరెను
శ్రీమహావిష్ణుని। కృపయెటులున్నదో

మి॥ స్వామీ శ్రీయాంసివిఘ్నాయనిన। బుధుబుద్ధోక్త జ్ఞప్తికివచ్చుచుండెను
మామకతల పస్తిరమగునట్టుల। మదియోచింపుమ జయమగునట్టుల

వ॥ అనినఁ నానశిష్టుండు దథాస్తని రేపేమంచి ముహూర్తమున్నయది
రామునికింగూఁడ చెప్పవలసియున్నది రప్పింపుమన పృథునాజ్ఞనొంది
శ్రీరామునికొఱకేగుచు సుమంతుండు దనలో నిట్లనుకొనియె.

ఉ॥ ఈమహరాజు పల్కులవియేమొ వినంబడె వ్యర్థరీతిగా
రాముని రాజ్యవైభవము బ్రస్తుతముం గనలేనొకంమనో
యేమొ జనించు సందియమొకింతయు హేతువుగానరాదు ముం
దేమగునో యెఱుంగఁదగదీశ్వరు చిత్రములేరెరుంగనా

మంజరులు.

నామదికెప్పుడు సంశయబంట। న్నదియే కలుగఁగబోదు
ఏమియేని యిసుమంతగల్గునెడ। నేముప్పారాకపోదు॥
అనుకొనుచు లోనికేగి రామచం। ద్రుని లక్ష్మణునిం దెచ్చెన్
జనకునిదఱి కాసుతులురాఁగ నా। స్థలమెల్ల కాంతిహెచ్చెన్॥
వచ్చిన పుత్రద్వయము గురువులకు। వందనంబుల నొనర్చెన్
మచ్చికరా నాగురుద్వయము రా। మలక్ష్మణులఁ దఱిజేర్చెన్
కళ్యాణమస్తు రావనాయనుచుం। గడు భక్తితో గురుమును
గళ్యాణమస్తు పుత్రయనుచుం। గడు బ్రీతింజనకుడును॥

వ. శ్రీరాముని సహోదరసహితముగా నాసీర్వదించిన యనంతరము
రాముండు దండప్రణామంబొనర్చి నాన్నగారూ! నన్నురావింపం గతంబే

మియోకలదని మంత్రియగు సుమంత్రుంను నుడివె నకెద్దియన!
దండ్రియాదాశరథి కిట్లనియె.

ఉ. ఆసతొలంగి యేలికల హోయిగతాతలుఁ దండ్రులుఁ బవ
భ్యాసముచేత నేలితిని వారలలోన శతాంశ మేదొ నీ
కోసముజూతురెల్లెడలఁ గోరికలూరఁగ నెల్లవారలున్
భూపతినెట్టులేలెదవొ భూపగణంబులు మేలుమేలన్.

క. నిన్నెన్ని రాజుఁజేయఁగ
నెన్నెన్నొదినములనుండి యెంచితిఁగానీ
నిన్నువిడి యడవికేగిన
నున్నయెనాయుసురులంచు చూచితిమున్నన్.

వ. అనినంత శ్రీరాముండు తండ్రి యశ్లీలము లాడెదరేల ననిన
గొంచెము చింతనభినయించుచు దశరథుండిట్లనియె.

కాంభోజి—రూపకము.

ప॥ ఏలుకొనుముతండ్రి యీ । యిలను సురలుమెచ్చునట్టు ॥ లే॥
అ॥ పాలింపఁగజాలఁబట్టి । బడుగుముసలినైతినిలను ॥ఏ॥
మి॥ చాలాకాలము సుఖినై । చక్కని యోచనతోడుత
లీలావినోదియగుహరి । లీలను ఖలులం దునుముచు॥
చ॥ కాలమెల్లఁదీరి స్వర్గ । గామినై యున్నాను నేను
ఏలఁదగిన నయస్కుఁడవే । యిలను తగిన సమర్థుఁడవు
మి॥ బాలచంద్రధర సముఁడగు । పరశురాము నడఁచినావు
బాలుఁడవే నీవు నాదు । భాగ్యంబవుగానఁ దనయ ॥యే॥

వ. అను జనకునితో—

మంజరి.

మీయాజ్ఞను శిరసావహింపక । నీమరువాడనా కాని
నాయనుంగు సోదరులు దశిలేని । దైనలోటు మదిఁబూని

మరియొకపుడు పట్టాభిషేకంబు । సరవిమీయు వేడుకొందు
భరతశత్రుఘ్నులు దఱినుండుఁ । సంబరముగ భువిఁగ్రాఁ కొందు॥

వ. అను రాఘవునితో నారఘుకుల తిలకుఁడు —

మంజరి.

కాకినా సిరిపుఁదన్నిన యట్టులఁ । గలఁగంటిరి రఘురామ
యేకరశేనైన రేఖధరణీ । వేలవలె సుగుణధామ॥

తే. కాలదోషంబు పట్టెడు కాగితంబు
కరణి జ్ఞప్తికివచ్చెనా గతవిధంబు
మారు మాటాడఁబోకు కుమార నీవు
పట్టభద్రుండవగు మట్టుపై నుడివెద.

వ. అనిన జనకునకు రామచంద్రుండో తండ్రీ! సోదర వాత్సల్యమున నట్లంటింగాని.

తే. తండ్రి యాజ్ఞయయ్యెన-గోతత్క్షణంబ
దారుణాటవి కైనను తరిలవలయు
నేలుకొమ్మని రాజ్యమ్ము నిచ్చుచుండ
దడయుటేలఁ దండ్రీ యిది తప్పుపనియె.

వ. అంత వశిష్ఠుండు రామునింజూచి యీతనితో నిఁక రేపటినుండి విలాసముగ మాట్లాడ నవకాశముండదని లోనెంచి? రామచంద్రా యీనాడు నేఁజెప్పినట్లు సేయవలయుం జక్కఁగా వినుము.

మంజరి

ఈవును నీసతి సీతల్లియింట । నీరేయి యుండవలయు
నీవు నీభార్యయును నీ రేయిని । ...........

వ. అని యూరకుండిన మునింజూచి రాముండుఁ జిరునవ్వునవ్వి సిరము వంచిన నమ్మునిగని రామా యేమినవ్వుచున్నావు పడుచువాడవగుటచేతనా? సంపూర్ణముగా వినుము.

... .... ... ... ... ... ... ... ...

................నిరాహార్లు గావలయు.

వ. అనిన శ్రీరాముఁడు: జిత్తమని గురువులయొద్ద సెలవుఁగొని లక్ష్మణసహితుండై లోని కేగిన యనంతరంబా మునిపుంగవ రాజపుంగవ మంత్రిపుంగవులు, నిర్మలచిత్తులై యుండ సుమంతుండు వశిష్ఠుం గని గురువర్యా నేను సిద్ధపరుపవలసిన వస్తువులెవ్వియన నతండు మంత్రీ! నీవెఱుంగని వేవేనిఁగలవే బుద్ధిమంతుండవు, నన్నడుగుచుంటివిగాన చెప్పెదవినుము శ్వేతచ్ఛత్రింబును, శ్వేతాశ్వమును, వృష్ఠ గజంబును, కపిలగోవును, నవధాన్యంబులును, హేమకలశ శతంబును, నిలువెత్తు స్వర్ణనాణెంబులును, బాణోపహతముఖ పూర్ణ సింహ చర్మంబును, కర్పూర గోరోజన కస్తూర్యాది పూజాద్రవ్యంబులును, నిర్మల నవరత్నంబులును, పీతాంబరంబులును. కించిచ్ఛృంగవృషభంబులును, పూజార్హపుష్ప ఫలాదులును, సర్వాలంకార యుతరథంబును నూతన శస్త్రంబులును, పసపుఁగుంకుములును, గోఘృతంబును, రావికాష్ఠంబులును, సంపూర్ణవయఃకురంగచర్మంబును, తాంబూల చందనాది సంభారంబులును, రేపటి సూర్యోదయాత్పూర్వమే సిద్ధపరచి, రాఁదగినంత దూరంబునంగలిగిన భూసురశ్రేష్ఠుల, క్షత్రియులనెల్లర రప్పింపు, మేనుదర్భఁస్నాత్రము తెత్తునని యేగిన యనంతరము పురజనుల, నౌకరులంబిల్పించి జనులారా రేపటిరామపట్టాభిషేకోత్సవము మీాయుత్సవముగా భావించి పట్టణమెల్లశీఘ్రము శృంగారింపుఁడని, వారింబంచి సుమంతుండును దశరథుండుం దమతమ కార్యములకై చనఁ బురజనులెల్ల శ్రీరామపట్టాభిషేకనిరీక్షణ కుతూహలులై సంబరమున విశాలమగు చలువపందిళుల వేయువారును, నరటిస్తంభంబులం బందిళుల చెంతం బాతువారును, తోరణంబులం గట్టువారును, రచ్చలను రథ్యలను సందు

గొందులనుండడిపి మ్రుగ్గులుంచువారును, నారోగ్యమునకై వెల్లల న్వేయువారు నంకమునకై జేగురుదులం బూయుచు, చుక్కలుం చుచు, చిలుకసైనుంచు, బట్టీలంబ్రాయువారునుం గడపలకు పస పురాచి కుంకుమలుంచువారును, బొమ్మలబల్లలను సుద్దముగ్గులు నుం, జుక్కలను నుంచువారును, వస్త్రంబులం బాగుచేయించు కొనువారును, అభ్యంగిన స్నానములాచరించువారును, నూతన వసనంబులం గొనువారును, పాతబడిన నగలన్మెరుగుం దుడిపించు కొనువారును, "శ్రీరామచంద్రప్రభు పుంగవునకు జై" యని వ్రాయబడినజండాలనెత్తికట్టువారును, శ్రీరామపట్టాభిషేక కాలం బునం గానుకలు సమర్పింప దమ తమ మూలధనములం దీసియుం చువారును, అన్యగ్రామములనుండి యేనుంగులపైఁ, గుఱ్ఱంబులపై బేగిరావులపయిం బయనములై వచ్చువారును దగిన సమయమని నూతన విచిత్రకల్పములతో నిదివరకు తయారుచేసియున్న సిల్పంబు లంకై కదీసి మెరుంగులుచేసి తెచ్చువారును, గంటంబులమూరి తా ళపత్రంబులపైఁ బద్యంబుల రచించువారును, ఆశీర్వచన శ్లోకం బులల్లి లక్షణంబుం దిలకించుకొనువారును, వల్లించిన పాఠములఁ దల్లక్రిందులుగ నప్పగింపం జ్ఞప్తికిఁదెచ్చు కొనువారలును, తర్క మీమాంసాది శాస్త్రంబుల ముఖ్యవిషయంబుల మాత్రము గుర్తు బుపెట్టుకొనువారును, దమతమ జంత్రగాత్రములం జక్కజేసుకొను వారును, వివిధములగు వర్ణములతో పట్టాభిరాముని చిత్తరువుల వ్రాసి తెచ్చువారును, తామునేర్చిన సాముగరిడీ వాయుస్తంభన, జలస్తంభనాగ్ని స్తంభన మొదలగు విద్యలనెల్లరికిం జూపుదుము గదా యనుకొనువారును, చాలశ్రమనంది వివిధవర్ణవివిధగమన, వివిధశబ్దంబులుగా నుండంగలుగు బాణాసంచాలం జేయువారును, కైవారంబులంజేయ నుకొంచి తమ డవాలు, కత్తి డాలు, కర్ర మొద

లగునవి మెరుగుదుడుచువారును, నాట్యమాడు నప్పుడేమైనం బొరపాటులు వచ్చునేమోయని తమలో దాము సరిగా నాడిచూచుకొనువారును సింహాసనములు పట్టుటకై తెలియలం దోముచువారును పుష్పమాలలం గూర్చువారునుం దమతమ బంధువులను గౌరవింపం బిండివంటలం జేయువారును, "ఆహా శ్రీరాముడు శ్రీమహావిష్ణువు గాక నీసందడియుండునా ప్రపంచమినానినట్లీ చీమలబార్లవంటి జనులేమి, పట్టణమంతయు నీకళయేమి, దిక్కులు పిక్కటిల్ల ననేకవిధంబులగు నీవాద్యంబులేమి," యని సంతసముగా జెప్పుకొనువారును చూచెదుసందడి కద్భుతంబుజెంది తమ్ముతాము మరచి జంత్రపుం బొమ్మలవలెం దిరుగువారును జనులకేవిధమగు నపాయములేకుండం గాపాడువారును నీరీతిననేక భంగులం గళలీనుచున్న ప్రకృతిసందర్భమగు నాసమయంబునం మంధరతనయింటిలో నుండి బయటికి వచ్చి యిట్లనుకొనియె? "అయ్యో యేమియీవైభవము నేను మా కైకభవనమునుండి వచ్చి యొక్కజామో జామున్నరయో కాలేదే ఇంతసందడిగా నున్నదేమి, నిదురమత్తున నిట్లు కన్పట్టుచున్నదా? కాదు కాదు నిశ్చయమే" అ-అ.

బేహాగు—జుల్వా.

ప॥ అయ్యారె యీశృంగారం । బాశ్చర్య మయ్యెడిన్

అ॥ రతనాలసాగుచుండె । నే । జ యాంబు జరుగునోగదా॥

చ॥ నాకుం దెలియరాని శుభం । బేకరణి నగునొ చూచెద
నాకర్ణించెదను భటుల । నైనం బిలిచి కారణం బయా॥

వ.. అనుకొనుచు నచట నేయున్న యొక్కభటుని బిలువ నైదారుగురు వచ్చి రంతవారి "నోరీ యెందు కీట్లు పట్టణ మలంకరించు చుంటిరి." అనిన నాభటులా మంధరం గాంచి,

బిళహరి—ఆదితాళము.

ప॥ సిన్నదొర పట్టాబి । సేకమంటమ్మ రేపు ॥సి॥

అ॥ ఎన్నాళ్ళున్నందో సూడ । యేదుకపడుతున్న మన ॥సి॥

చ॥ పచంద్రైన పదిసెంబరి । బట్ట లెడతారంట మాకు

వచలైన పింఛోంటల్ తోటి । వణ్ణాం బెడతారంట రేపు ॥సి॥

వ. అనియెదు నౌకరులపైఁ గను లెఱ్ఱఁజేసి పొందు మీఱసి తనలో మరల నిట్లూహించె.

(అయారె యను కీర్తనలోని యన్వయము)

బేహాగ్—జల్వా

1॥ గూని తిన్నఁజేసి నన్ను । కానిపోనిపనులకు లో

గాను జేసె పీనిని నే । కానకు నంపింతునే ॥డయా॥

2॥ నాకు వీఁ డొసర్చిన య । న్యాయపు లపకృతికిఁ దప్ప

కే కరణినైనఁ బగవ । హించి కీడొసర్పవలె ॥న॥

వ. ఇట్లూహించి కోపావృత హృదయయై పోరా! మూఁ గై కకొడుకు రాజైన జైత్రనమంతయు నాయదియేయగు నారాముప వనమునకుంబంపి భరతునిరాజుగాజేయు సుపాయమాలోచించెదఁ గైక నాచేతిలోనిది, రాజాపెచేతిలోనివాడు మఱియు నాతలంచినట్లగు ననికూడ నేతత్క్షణముననే పొడకట్టుచున్నయది, నేను బ్రతికి నన్నాళ్ళు బ్రతుకుదునా! నాశక్తి నొక్కమారుచూచుకొని నేన సంతసించెద నేటిసందడి యెందరోకలసి యింతజేయుచున్నారు నేనొక్కతెనే రేపటికింతకన్న నెక్కుడుసందడిం జేయుదునని లోన దలఁచి నిదురించుచున్న కైకయొద్దకేగి.

చ. పురజనులెల్ల రాఘవుని భూపవతంసునిఁ జేయుచుండనే

మఱియును నిద్రఁజెందెదవు మానిని యేమికతంబొ చెప్పుమా.

భరతునికంటెపిన్రీతిగ శుభంకరురాఘవుఁ జూతువింతలో
నరమరలేమియేని మది కంటకమయ్యెనో తెల్పుమమ్మరో.

వ. అనియెడు మంధరవాక్యంబులన్ మోగంటనున్న కైకకు సరిగా వినఁబడక "మంధరా యేమనుచుంటివి రాముని"......

మం—రామునికి పట్టాభిషేక ప్రయత్నము జరుగుచున్నది, పట్టాభిషేక మగుననుచున్నాను.

కై॥ చ. మనమమృతంబుసేయు నుడి మంధిర మేల్వినుపించినావు నీ
ఘన ఋణమెట్లుతీర్తు సఖి కైకొనుమీ రతనాలహారముగ
ఇనకులమెల్లఁ గీర్తిఁగొన నీరఘురాముఁడె కారణుండగున్
జననుత పాత్రుఁడున్ బరమశాంతమనస్కుఁడతండు చూడఁగన్.

బిళహరి—జంపె.

ప॥ మంచిమాటఁ జెప్పినావే । మంధరా సంతోషమయ్యె
అ॥ సంచయాసయగు జానకి । యాహా పట్టమహిషేయౌనె.
మి॥ ఎంచగ నీఋణమును నే । న్నెట్లుఁదీరుపఁగలనే
పంచామృతముల మించిన । పల్కులాడినావుకదే ॥మం॥

మంథర.

౧॥ అనియెడు కైకకు మంధర యిట్లను । నాశ్చర్యముఁబడ్డట్లు
మనరాముని కభిషేకమని మూడు । మాసములనుండియిట్లు॥
౨॥ గుసగుసలు పుట్టినట్లులెన నో । కోమలాంగి వినలేద
ముసలిరాజుగారొనర్చు కృత్రిమ । మసలే గ్రహింపలేద॥
౩॥ ఇరుగుపొరుగువారు చెప్పుమాటల । నేమెమాయనుకొంటి
సరిగా సరిపోయినదిప్పుడు నీ । సరణిమెల్లఁగనుగొంటి॥
సీ. నాయక్కతో సమానమ్మంటువమ్మ నీ
సవతి యెంతటిబుద్ధిశాలియు విను

నాకంటెఁ బ్రీతియే నాతిపై లేదని
నమ్మినసీనాథు నడక గనుము
నను సుప్రీతింపకుండినను నాసవతియే
మననైన ననడంచు కనుపసంగు
నాకుఁ దెల్పకఁ బతియేకార్యమొనరించు
ననుచు నెన్నోమార్గు కసఁగినేడ
తే॥ దంతనైభవమోహంబు మింత్రియుకను
గొంచమేనిమాటాడదు కోసలసుత
రాడు సీమేడకిఁక రాజరాజపినుము
సర్వగౌరవంబులికఁ గౌసల్య వెసుము.

వ. అను మంధరవాక్యముల కబ్బురపడి మంథరా యేమిట్లనుచున్నావు నాపతియు నాసవతియు నన్నేమి యన్యాయము జేసినారు.

శ్రీరాగము.—త్రిపుట.

ప॥ ఎన్నఁడుగా బల్లెత్తుమాటనియే । నెఱుగదేనాసవతికోసలసుత ॥య॥
అ॥ నన్నుసోదరికన్న మిన్నగదాఁ । గన్నయట్టి తల్లియెగాదానీకే మెరుక
మి॥ సన్నుతపాత్రుండే నావిభుఁ । డెన్నో సద్గుణములుఁగలాఁడె
మిన్నగి నన్నానతులకన్న । నెన్నుచుండునామాటస్మరించ ॥ద॥
చ॥ రామచంద్రుండు రాజుగాదగు గుణ । ధాముఁడే నాయగ్రసుతుడే
యేమికృత్రిమ మిందుఁగలదే । యెఱుఁగజెప్పవె కారణంబును
మి॥ నీమాటలునాకుఁ జిత్రముగు । నిర్భాగ్యపుకంకా చాలిఁక
నేమోయనుకొంటిసికాదే ॥ యెరుఁగనైతి నీకింతతెల్వికల్గు ॥కు॥

వ. అనెను కైకపలుకులప్పుని యమ్మా నీవింకను వెరటిదారినేయుంటి వింతకాలము నాయొద్దనుండి నాతిండిఁ దినుచుఁ దగినసమయము నకైన మంథర యుపకృతి సేయలేదయ్యో యనుకొందువని, నే నేదో నీమేలుఁగోరి చెప్పవచ్చితిం గాని, నీనాథునకును నీసవతికిని నీసుతు

నకు నెడబాపవచ్చినదాననుగాను నీబహుమానము నాకేలనని ము న్నుకైకొన్న హారముం ద్రెంచి పోఁబోవు మంథర కేలుంబట్టి యాపి, మంథరా ! యేమింతకోపమువచ్చినది, నీయభిప్రాయముం జక్కగా వింద నదేదో చెప్పుమనిన మంథర యిట్లనియె.

కమాచి—ఆది

ప॥ చెడిపోయెదవు సుమ్మా ॥అమ్మ॥ చె॥

అ॥ అడియాసతోడ నుండకుమా యొకనికడియమైనముప్పగున్ వినుము॥

చ॥ ఏమో తెలిపెను మంథర యనుచును । నీమనమునఁ దలచెదవేమో నలువది పైపూర్ణానుస్వారము నంకించునట్టులగు నీపని ॥చె॥

తే. గుసగుసలు గుభగుభలును గొనగొణలును
ఒండొరుల కోర్కెలొక్కటై యుండుటలును
ముందు జరుగఁబోయెడుకార్య ముగిపెములును
బెనగిరీ మూఁడుమాసముల్ ప్రీతితోడ.

కై —ఏ మూఁడుమాసములు—

— నరతశత్రుఘ్నులను యుధాజిత్పురము బంపినది మొదలీ మూఁడుమాసములును... కావలసినంత కంతయున్న దదంతయు నీకే మి తెలియును ? మఱియు విను,

తే. నీమగఁడు నీసవతియును నీకు భృత్యు
లట్లు కనుపడినంతనే యలరి యలరి
పొంగడమువోలె నే పొంగిపోదు కాని
తూర్పు పడమర నెఱుఁగెదు నేర్పులేదు.

తే. గడ్డిపోచలు బంగారు కరణి మెఱయు
నుప్పుకూడ కనంబడుఁ గప్పురమటు
దుర్జనులు సజ్జనులపోల్కి దోచుచుంద్రు
రుచి, స్వభావము, తిన, కన, రూఢిపడును.

వ. భరతు నూరికిబంపిన దెందుల కనుకొంటివి, యొక్కనాడే రామ పట్టాభిషేకమున కేర్పాటుజేయు టెందుల కనుకొంటివి, యింతవర కున్నిను చెప్పకయే యుంట యెందుల కనుకొంటివి, తినుటయుం బండుకొనుటయు ననుకొంటివి కాంబోలును, రామరాజ్యాభిషేక మైనపిదప నవు కౌసల్యాదేవిగారి కేమగుదువో తెలియునా ?

కై—ఏమయ్యెదను! చెల్లెలి నయ్యెదను!

మం—అట్లా? అట్లుకాదు నేను నీ కేమయ్యెదను?

కై—దాసివి ?

మం—నీవును ఆమె కంతియే యయ్యెదవు.

కై—ఏమే యట్లనుచున్నావు?

మం—ఏమా ? కౌసల్యాదేవిగారు చక్రవర్తిగారి తల్లిగారైనపిదపం బెత్తన మామెచేతిలో నుండునుకదా ? సవతులకు ద్వేషముం డక తీరదుకదా ? అప్పుడు నీకామె యెత్తి యేపూట కాపూట ఎత్తుబత్తె మిచ్చుచుండును. అప్పుడు నీపని, 'లక్ష్మీకళ్యాణమే వైభోగ్యమే' యగును.

క. అనినంతనె కైకమనం
బినుమైయినను మునకుం దెగక నెసంగెదురవర్లొ
పెనిసిన మంథర మనమై
ఇనకుల కల్లోలమునకు నెంచగం దొడంగెన్.

మంజరులు.

1॥ మనసంతయుజెడి కైక యిట్లనియె । మంథరతో నప్డలిగి
కననేమార్గముం దోచకున్నదే । కరణిని ధర్మముదొలగి॥

2॥ రామరాజ్యంబుం భరతునకిమ్మని । రాజునెట్టులడుగుదును
శ్రీమదన్వయమునం గలయాచార । మేమిచెడగొట్టంగలను॥

3॥ వంశపరంపరం బెద్దవానికే । వచ్చుగాదె రాజ్యమ్ము
సంశయముగల్గె నేనెట్లడుగగ । జాలుగురామని సొమ్ము॥

తే. ఏదియేని యుపాయమ్ము నెంచిచెప్పి
కార్యసాధన మార్గముం గరపుమనిన
నమ్మ నీకొకప్పుడు మెచ్చి యవనివిభుడు
రెండువరముల నొసఁగె న ।వుండలేదె.

మంజరులు.

1॥ రాముని వనికంపుట కొక్కటియు భ । రతురాజుఁజేయ నొకటి
నీమగనిఁ గోరవచ్చు ననితిరుగ । నేరఁడుగాన నిదొకటి
2॥ కోరుకొమ్మనిన శ్రీరామునిపైఁ బేరిమిజ్ఞప్తికి వచ్చి
నీరుగాఁదొడఁగె మన మదిగ్రహించి । నీకిదేమమ్మ పిచ్చి॥
3॥ సిరిరా మోకాలడ్డెదు వారల । ధరనేనెన్నఁడుఁ గనను
మురిసెదవు రామలక్ష్మణులనినన్ । దరిగెదరు నీదుమెడను

వ. కైకా స్వలాభముం గోరి యన్యులకై యోచించు వారెంజూచితిం గాని నీవలె నన్యులకై యోచించి సుతునిగొంతుకోసి తన గొంతు గోసుకొనువారలం జూడనైతి? నింక నీయిచ్చవచ్చినట్లు చేయుమని రోషంబుపుట్టు మాటలంజెప్పఁ నీశ్వరప్రేరితంబైన చిత్తంబునం గల గోపమున మంథరతో నిట్లనియె.

బేహాగు—జల్వా

ప॥ రాముని వనికంపి । రాజుఁజేతు నాసుతుని
అ॥ నీమాయనెఱుంగనైతి । నెంతజేసెనే నృపుఁడు ॥రా
చ॥ చెప్పితివె సమయమునకుఁ । జెప్పఁదగినట్టి మాట
నెప్పగిదినైనఁ భరతుఁ । డేలఁగలఁడె రాజ్యమును॥
2॥ కౌసల్యపొంగును నా । కాంతునికృతిఘ్నమము
కాసంతయుఁ జెల్లకుండ । జేసెదనె క్షణములోన ॥రా

వ. అనిన కైకతో.

మంజరులు.

1॥ ఆడుదేదైన బోంకినం గోడిదు । నట్లుంమానవేదు మాట
నేడుసార్థకమునేయుము నిజమగు । నీవెగడాసు వనుమాట॥

2। యెట్టులైన నీనాథునిమనంబు । నిట్టికరగింపవలయున్
బట్టుదలవిడక భరతునకే మన । పట్టముంగట్టంగ వలయున్॥

3॥ వేగమె రాముని నట్టడవికి నీ । వెటులైనం బంపవలయున్
రాగముతో మెలంగుచున్న యెల్లర । రోగములడంపంగ వలయున్॥

వ. అదుగో నీనాథుండు వచ్చెడు సందడివిన వచ్చుచున్నది. నేనింకం బోయెద నని మరలి తనలో? నాకార్యము కొనసాగు నుపాయమాలోచించితి నీపైకార్యము కైకపయింగల దీమెతప్పక నికార్యము కొనసాగింపం గలదని యనుకొనుచు నేగినయనంతరము కైక సర్వాలంకారములు విసర్జించుకొని మాసినట్టియుం జినిగినట్టియుం జీరగట్టి కొప్పుముడివిప్పి కపటచింత నభినయించుటకై యలకగృహమునం బ్రవేసించె. తదనంతరంబు దశరథభూపాలుండు పట్టపుదేవికైనం జెప్పక శ్రీరామపట్టాభిషేక శుభవార్త కైకకుం జెప్పి తానంతసింప కైకేయీభవనంబున కేగి వెలవెలంబారుచున్న కేళీమందిరముంజూచి యిట్లనుకొనెను.

సీ. రాదేల యెదురు నా రతిచేతి పూబంతి
కారణంబేమియో కానరాదు
పలుకరింపవవేలం జిలుకలు నన్నిప్పు
డలరుచు నాన్న? యంచనెడివకట
నాజాడంగనగానె నన్నుట్టుకొను లేళ్ళు
వెండిబోనులలోన నుండెనేమొ
నారాకకై కాచి హారతులిడునట్టి
దాసీజనము లెందుదాగినారొ

తే. రాముపట్టాభిషేక మదేమియగునొ
రామరామ రామారామ రామరామ
నీయదృష్టమెట్లున్నదో నేనెఱుంగఁ
దైవవశమెట్టులున్నదో తరమె తెలియ.

తే. ఎవనిక్షేమంబుఁ గోరునో పృథ్వివిని మది
వానికే కీడుశంకించుఁ బలుగతులనుఁ
గైకకారుడుకూర లేనట్టి కారణంబు
కూడ కలఁచుచుండెడు నాచుకుక్షిలోన॥

క. కైకకు స్వస్థతతప్పెనొ
మైకముచేఁ బండుకొనెనో మఱియేకతమో
యీకరణినుండె మందిర
మోకమలాక్షా సహాయముండుము నాకున్.

వ. ఇందుల కేదియేని ప్రబలకారణ ముండియుండును. పరమేశ్వరా?
యేమిసేయుదును.

తే. కర్మమే తన్ను నడిపించుఁగాని నరుఁడు
తలచినట్టుసేయ నేఱఁడెన్నాడినేని
శాస్త్రసంపన్నత నిమించు జాణయైనఁ
కర్మబలమన్నిటికి మించుఁగాదె తలఁప.

వ. ఏమైన నగుంగాక యని యాకేళీభవనమున వెడికి వెదకి యలుక
గృహంబున నీక్షించి కచబంధవిముక్తయై యలంకార విసర్జితయై
యున్నల యన్నుమిన్నంగని బెగడంచుచు నామెదటింజేరి వెలవెలం
బోవుచు గాఢ్యనై పునం గూర్చుండి ముసుఁగుదీసి ముఖము జూచు
చు నిట్లనియె.

జేహాగు — త్రితాల్. –

ప॥ ఔనే మిటారి యిట్లు । మానమేలనే కటారి

అ॥ నేను నిన్నేమియన । నేరనుగదే వయ్యారి ॥యా॥

చ॥ సారసలోచన నీ । వూరకున్న మనగలని
నేరమెవఁడు జేసె నీకో । నారి వాని దండింతునే ॥యా॥

2॥ శ్రీరాముని పట్టాభి । షేకమిష్టి చేయనుండ
నేరీతిని నీమదికి । నింపయ్యె నీతీరుననుండ ॥నా॥

సీ. నేవచ్చుచుండఁగా నీవురుల్ సవరించు
చెదురురాలేదేల యిందువదన
స్వర్ణకంకణముల స్సవరించుచునోర్మవి
ముద్దుఁపెట్టవదేల మోహనాంగి
చిరునవ్వునవ్వుచుం జేతులనాఁజాపి
సంజ్ఞసేయవదేల సరసిజాక్షి
కెంగేలఁగీలించి సింగారపుఁబచారు
బానరుప వదియేలఁ బువ్వుఁబోఁడి
తే. నీయెడలలోపమేమి నేచేయలేదు
ఇంచుకాలసించితిని నీకించదీర్చు
రాముపట్టాభిషేకంబు గ్రాలుకతన
గోపముంచకలెమ్మికఁ గోమలాంగి.

వ. లెమ్ము లెమ్ము నీకోపకారణంబేమో నీకపకారమొనర్చిన చెనటి యెవ్వండో నాకుంజెప్పి యనుగ్రహింపుమని వేడుకొనియె.

తే. సర్వరక్షకుఁడేకాని సాధుకాని
తేజమునఁ దేశములనేలు రాజుగాని
బ్రహ్మఋషిని గావలెననువాడు గాని
పాశబద్ధుండుగాకున్నె పడఁతివగల.

వ. అంత నాకైక కపటచిత్తయగుటచే రాముని పట్టాభిషేకసందర్భమే

యెఱుంగనట్లు నద్భుతంబుసెందిన ట్లభినయించుచు రాముని కేమగు
ననుచున్నారు?

ద—పట్టాభిషేకము.

కై —నిజమా.

ద—నిజము.

చక్రివాకము—త్రితాళ్

ప॥ నమ్మరాదు మగవారిమాటలను ॥న॥

అ॥ నమ్మికగా సంచరించుచుందురు ॥న॥

చ॥ కరతలామలక మట్లగుపడుదురు
కరముదూరభావమున నటింతురు ॥న॥

౨॥ అరచేతను స్వర్గముఁజూపింతురు
కరకరమని గొంతుకలంగోతురు ॥న॥

తే॥ ఇన్నినాళ్ళయ్యెనే వచ్చియెన్నఁడైన
నిట్లుజాగొనరించితే యిటకురాక
పట్టపుందేవి కౌసల్య పజ్జనుండి
దాశరథిరాజనెడువంకఁ దాచెదేల॥

మంజరి.

౧॥ నన్నుసంతోషపరచుటకై నీ । నక్కవినయములుచూపి
నన్ను మోసగింపవచ్చితివి నే । నమ్మనీమాటపాపి॥

వ. అను కైకకుం దశరథుం డిట్లనియె.

మంజరులు.

౧॥ ఔనెముద్దులాడి యింతమాత్రిం । బాలస్యముసేయగనె
పూనిపంతముననన్ను నిటు చిన్న । బుచ్చుటలు నీకుఁదగునె॥

౨॥ ఈనీవిచారమెల్లఁజానకి । జానిరాజగుటగనుక
మానెదనియెఱిఁగియిట్లుచేసితిని । మన్నించుదోషమనక॥

వ. నాథా రాముసకు నిశ్చయముగాఁ బట్టాభిషేకమా?

వ. ప్రియసీ నిశ్చయము రామునితోఁడు.

వ. ప్రాణేశ్వరా ఎప్పుడు?

వ. సఖీ? రేపు ఉదయము.

వ. నాథా అట్లైన రేపటినుండి మీపెత్తనము (అధికారము) తొలఁగి పోవుఁగాబోలు?

వ. సఖీ

మ. సరిగా ముప్పదివేలయేఁడులిల నేసాధించితిన్ రాజులన్
వరపుత్రుల్ సుగుణాఢ్యులార్యులును దర్శింబా యశోపేరుల్గా
దరిఁజేర్పఁగలయట్టివారు మనకత్యామోదముం గొల్పఁగ
ల్గిరి సౌఖ్యంబులఁగొంటి నేలఁజలబాతీ పెత్తనంబిఁకటన్.

వ. నీకేమేనిఁ గావలసియున్న మనరాముఁడియుఁడనికాబోలు? నేదేని కావలసినఁ గోరుకొమ్ము. నేను నీకొసంగియే రాముని కభిషేకం బొనరించెదను.

మత్త. ప్రాణనాయక నేను కోరెన । వాని నాకిడెదంచు మీ
రానతిచ్చుచునుంటిరే? నిజ । మాన లేక యబద్ధమా
మానికిచ్చితిఁ గోరుకొమ్మని । మారుబల్కఁ తిరొట్టులే
యానటంచును సంశయంబును । సంకురించెసుభూవరా.

వ. అనెడుకైకతో, సతీ నన్నిట్లత్తిప్పామఁపుమాటలాడి యేల బాధించెదవు, నీయిచ్చవచ్చినదానిం గోరుకొనుము శ్రీరామసాక్షిగ నిచ్చెద.

వ నాకు వెనుక దేవాసురయుద్ధకాలమునం దాము వరద్వయమ్మును నాకొసంగ నాయందసాయున్నవుడు కోరుకొంమనంటిఁ జ్ఞప్తియున్న దియా?

వ. ఔను నీవరములనీవు కోరుకొనకింత యాలస్యమేల?

వ. నాథా. స్వావరముల వినుము.

మ. భరతుండే మనరాజ్యమెల్ల సుజనుల్భావంబుల న్మ్రొక్కఁగా
బరిపాలించుట కాజ్ఞ నీయగవలెన్ బద్నాలుగేఁడుల్ వనిన్
దిరుగన్ రామునకాజ్ఞ నీయవలె నింతే నాతలంపన్న భూ
ధరుఁడున్ ధారుణివ్రాలె మూలమున ఛేదంబైన వృక్షంబనన్.

వ. కొంతతడవునకు లేచి కైకం జూచి యిట్లనియె.

తే. అయ్యయో రామచంద్రునే యడవి కనుపు
మంచు మాటాడినావు నీకేమి యెగ్గు
చేసినాఁడాతఁ డిట్టులఁ జెప్ప నీకు
కల్గెనా బుద్ధి యెవ్వరైనఁ గఱపినారొ?

ఉ. ధీరుఁడు రామచంద్రుఁడు సుధీమణి సర్వజనేష్టుఁ డెప్డు నీ
కూరిమి ముద్దుబిడ్డఁడయి కూర్చుఁడునాఁడు ప్రియం బనంతమున్
దూరఁడు తప్పుఁజేయు నొక దూతనుగాని పరోపకారి పెక్
గూరిమితోడుతన్ భరతుఁ గూడియె యుండు నిదేమి కర్మమో.

వ. నీవు నిజముగా నిట్లనుచున్నావని నేను నమ్మను నామనం బారయు టకై యిట్లనుచున్నావు, నే నెఱింగితిని, నీవు కోరినకోరిక, నీవు కోరఁదగినదియుఁగాదు నే నంగీకరింపఁ దగినదియుఁ గాదనినఁ గైక యిట్లనియె.

బంగాళతోడి—ఆదితాళము.

ప॥ ఇదియా సత్య మెదియైనఁ గోరు మిచ్చెదనని ॥యిది॥
అ॥ అదిమి పట్టుమీ కంఠము స్వర్గం । బరుగుఁ గైకమఱియెందుకిచట॥
చ॥ ఆహా సూర్యవంశ మెంతలో స । త్యహానికి రవయ్యె నినుఁగూడ॥ని
2॥ పగిపాటి నీకిదియే యనుచు నే।బల్కఁగావినకనభయమిచ్చి॥యిదియా
3॥ నీటిపైనవ్రాతలే క్షత్రియుల నిజములన్న సామెత చేసితి ॥వి॥

తే. భానువంశజు లన్నృతంబు బలుకరేని
నేను నిజమైన ప్రానిక నిలుతు నేని

దైవకృప దీనిలో సుంత తనరేనేని
రాముఁ డేల్లేలు భువిని భరతుఁడే కాని.

వ. కైకా! అంతకోపము వహించితివేల? నాయెడలం దయయుంచి చెప్పుము. రాముని సద్గుణంబులు నీ వెఱింగినదానవైన స్మరలఁ జప్తికిఁ దెచ్చెద న్వినుము.

సీ. తనకు భృత్యుండైన మనుజునిన్ ఘనునిగా
మనరాఘవుఁడు చూచుకొనునుకాదె
యొరులు సేవలొనర్ప నొప్పుకొనక రాముఁ
డవయవంబుల సేవనందుఁ గాదె
యే జీవమునకేని హింససేయక మన
సుతుఁడు సద్గుణములఁ జూపుఁగాదె
తనతల్లికంటె నీదటి మన తొలిసుతుం
డలరుచు భక్తితో మెలఁగుఁగాదె
తే. యట్టిపట్టిని యేమిటుల్ నట్టడవికి
నెట్టుటకుఁ గంకణంబునుఁ గట్టినావొ
యెట్టులైననుఁ బుణ్యంబుఁ గట్టుకొనుము
పట్టమును రామునకు నీవె కట్టు మతివ.

ముఖారి — త్రిపుట

ప॥ ఏల నీకిటువంటి బుద్ధి । యిన సమానునిపైనఁ గలిగినది॥
అ॥ ఏలఁ జాలిన బుద్ధిమంతుఁడు రాము।డీధరిత్రిని సుగుణకోవిదుఁడాహా
చ॥ కాలము తీరినవాఁడ నేను । గాంచగవలె రామరాజ్యమని
చాలాకాలమునుండి తపము । సల్పినట్లు మది గోరుకొనుచునుంటి॥
2॥ నేల నేలిన రాజవర్యులలో । నెవ్వఁడున్ మనరాముఁబోలెడుగుణ
శాలి లేఁడని మానిముఖ్యులు చాలమంది తెల్పంగ వింటి॥

మి॥ నేలనిమ్మో దాసుఁడనయ్యెద । నిందువదన నీమేలుమరువ
భూలోకంబున రామభోలు।భుద్ధిమంతుఁ డన్వంశిటులెటులంటి ।।వే॥
వ. సతీ నిజముగా రాముండరణ్యమున కేగిన నాపాత్రింబులు బోవు నప్పుడు భరతుండు నివాపజలంబు లీయరాదు. నన్ననుగ్రహింపు మని యెన్నివిధంబుల వేడిన నంగీకరింపనందున శ్రీరామ పట్టభంగ మయ్యెనని యిట్లు దుఃఖించె.

---

# గంగావతరణము

కేదార—రూపకము

ప॥ అక్కటకట రామునివని । కనిపిబ్రిదుకఁ జాలుదునే ॥య
అ॥ యెక్కరణిని యాతఁడువని । కేగఁగలఁడు సుకుమారుడు
మి॥చక్కని తనసుతువిడి కా । సల్య యోర్చియుండఁగలద
చెక్కలయ్యె గుండెలు మా । శ్రీరామునిఁ దలఁచుకొలది ॥య॥
చ॥ కైకమాట సెలుపనేని । కల్లలాడు వాడనంచు
లోకులు దెగడుదురు నరక । లోకంబునుఁ బొందవలయు
మి॥ శోకమయ్యె పొంగిపొరలు । చున్నది నేపాపాత్ముండ
నాకియ్యెడ మరణము క । న్నన్ శరణములేదుగదా ॥య॥
వ॥ అని శోకించుచు నాయజనందనుండా కైకాభవనంబుననే మరల మూర్ఛంబొందె. నది యట్లుండం బిదప వశిష్ఠుండు శ్రీరామచంద్ర పట్టాభిషేకసమయాసన్న నిరీక్షణుండై యాసమయమునకుం బూర్వమే కృతస్నాన కృతవస్త్రకృతాలంకృతులైన శ్రీ సీతారాములం ద త్కాలోచితాసనంబులం గూర్చుండ నియోగించి.

తే. కంకణము రాముకరమునఁ గట్టివేగ
మేలుపగా కీర్తి లోకములెల్ల నిండ
దేవనర్త్యుల కోర్కెలీడేర్పఁ దీరుఁడపయి
రాక్షసాంతక జన్మ శ్రీరామచంద్ర.

మ. అనుచున్ శ్రీరుఁడు రామచంద్రుఁడిక నాహాయెల్లదిక్సీమలన్
మునుమున్నట్లురు ధర్మముల్ నిలిపి సమ్మోదమ్ముతోఁ గాచి యా
దనుజుల్ జేసెడి క్రూరకృత్యముల క్రోధంబంది పోజేసి యా
తనలంబాంగెడు సర్వసజ్జనుల బాధల్ ద్రోయుఁ గా కిత్తరిన్.

క. లోకము విన నబ్బురపడు
నీకారణమనుచుఁ దలచి యెఱుఁగని యట్టుల్
'ఏకారణంబు చేతనొ
రాకున్నాడింత దనుక రాజ' న నపుడున్.

వ. సుమంతుండను మంత్రి మహాత్మా! నేపోయి తోడ్కొనివచ్చెదనని కైకాభవనంబునందే దశరథుండుండు టెఱింగి యాకైకాభవనంబు నకేగి దశరథునికి వర్తమానమంపఁ గైకవచ్చి సుమంతునితో నిచటికి రామునిం బంపు మనిన నాతండిట్లనియె నమ్మా?

ఉ. ఏమియు రాజు మాటవచియింపక రాముని బంపుమందు నే
నేమని చెప్పువాఁడ గతమేమనియెంచుఁ జనంబు మీగురుం
డేమితలంచు రాముడిది యేమిటికో యని చిన్నవోవు వా
డేమియుఁ గారణంబరయకే నెటుబోవుదుఁ జెప్పుమమ్మరో.

ఉ. మంత్రిని రాయబారకుఁడ మాన్యులరా తమసేవకుండనే
తంత్రము సెప్పరాదు గుణధాముని శిష్యులమంత్రి నోటచే
మంత్రము లాలపింతురను మాటవచింపగ వచ్చినాఁడ రా
ట్తంత్రవిధిజ్ఞుమాట వినితక్షణమే యిటుతెత్తురామునిన్.

మంజరులు.

అతిగాబల్కక నిచ్చట రాఘవు । నంపుమొక్క త్రుటిలోనన్
శృతిమించి రాగిమునఁ బడునమ్మా । సుకృతులము మేముగానక
రాజుగారుని ద్రించుచునున్నా । రని చెప్పుము వేచనుము
పోజాగుసేయకుండ రాముబం । పుమునాయాజ్ఞను వినుము
అనిసగ్గికతాతిరిగిచనుచు ని । ట్లనుకొనియె మంత్రిలోనన్
జనునకొకరి సేవకంటె నీచం । బనునది లేదయియియునన్
విషయుతుఁడగు మగనిరాపుకంటెను । విధవాడపడుచు పోరు
విషమించును కోడలికనెడు మాట । విధిగానె జరిగితీరు॥

వ. అంటులనే రాజులసేనకన్న రాణులసేవయే కష్టతరము దైవమువర మిచ్చినను పూజారి వరమీయఁడని సామెతల్లోకెక్కటులనైన రాజులేపరిస న్నులయ్యెదరుకాని రాణులా విష న్నలయ్యెదరు గదా యని తలంచి వశిష్ఠునింజేరి యార్యా? రాజుగారు నిద్రపోవుచున్నారట? రాముని వేగము కైకమ్మగారు రమ్మనియాజ్ఞచేసె రనినంతనే శ్రీరామచం ద్రుడుపట్టువస్త్రములతోనే బయలుదేరి కైకాభవనమునకేగి యా పెకునమస్కరించి మూర్ఛాగతుఁడైన తండ్రింగాంచి కైకతో యిట్లనియె.

బిళహరి — త్రిపుట.

శ్రీ ... గ్రంథాలయ

ప॥ ఏలతల్లీ మాతండ్రి యిట్లు
నేలబడి స్మృతిఁదప్పి యున్నాఁడకటా ॥ఏ॥
అ॥ తాళజాలను తండ్రిచింతకునే । దలుప లేకున్నాను కారణమిప్పు॥డే॥
చ॥ జాలిపడియె నాహృదయమెల్ల । సంగతియేదో చెప్పుమమ్మ
చాలగతుల మోదింపగనే । జాడగానరాదు తండ్రివింత॥
శా. శ్రీరాముండదరు దెంచుచుండెననఁగా చిత్తంబురంజిల్లవే
రారా ముద్దులతండ్రి? యంచు నదుగారాబంబునన్ జేర్చెడిక్

ధీరోదారత నెన్ని కార్యముల నుద్దీపించినన్ బుద్ధియ
ద్దారిన్మీరి మరీమరీమురియు నో తల్లీ శతంబేటుటుల్

శా. నావల్లన్ ఘనలోపమేదయిన నెన్నంబోలు లేకున్న దో
దైవాయత్తముచేత కేవయిన వింతల్ ఫుట్టఁగానచ్చు గా
కీవేళస్థితి కంతరాయమెద్దియో యెంచంబడెన్ సత్యమి
భ్భావంబుల్ గతసత్యమైనయెడ మాబాబయ్య యిట్లుండునే.

వ. అమ్మా! నాచిత్తంబు తత్తరమందుచున్నయది, నైళంబ తండ్రి గారిచింతకుఁ గారణంబుఁజెప్పి నావల్ల గావలసినపని యేదియైనం జేయించి నాతండ్రిని మేల్కొల్పుము. నేను విషమునైనం గొని యన్నుజ్ఞనకుని మేల్కొలుపవలసిన నట్లొనర్తు నెన్నడైన నాతండ్రి నేవచ్చిన మాటలాడ కింతసేపుండెనా?

ఉ. అన్నముఁదిన్నయప్పుడును హాయిగ నిద్దురఁజెందినప్పుడ
త్యున్నత రాజకార్యములనుండిన యప్పుడప్పుడేల నే
నెన్నియొ నేరముల్సలుప నెప్పుడుగా నిసుమంత నాపయిన్
గన్నులనెఱ్ఱచేయుటలుగానను నేడిటులుండెనేమొకో.

వ. అను నారామునితో కైక యిట్లనియె.

చ. నిరతమునీవె రాజ్యమరణిం బరిపాలనచేయు దారయన్
భరతునికట్టి వైభవముపట్టుటచూడఁగ నాసపుట్టె నా
వరములురెండుగల్ల, నవిపాలనసేయఁగ గోరి. నీదుసో
దరునికి రాజ్యమిచ్చి నినుఁదాపససేవకుఁ బంపఁ గోరితిన్.

వ. ఇట్లుకోరినంతనే నీతండ్రి నిన్నువిడువఁజాలకనో నీవడవికేగఁజాలవని యో యిట్లు మూర్ఛాగతుండయ్యె.

తే. అనుజురాజ్యపాలనయు నీవడవినుంట
తండ్రిమతమునువిడిచియే తత్క్షణంబు

ధీరతను నీదుమతమేమొ తెలుపు రామ
తేటతెల్లముఁగాగ నీమాటవిందు.

వ. అను పినతల్లితో రాముండిట్లనియె.

ఆ. అమ్మ? నామతంబునడుగుట కిందులో
కష్టమింతయైనఁ గానరాదు,
అన్నతమ్ములమగునట్టి మాకీభేద
మెప్వ రేలుకొనిన నేమిచేలు.

ఆ. అరయనింతెకాక నమ్మనేకొసిక
మౌనివర్యుఁగూడి కానకేగి
కంటినచటిమునుల ఘనసౌఖ్యమునుగొంటి
మరల నచటికేగ మనముగలిగె.

వ. కాని యాకోర్కె నెఱవేరదయ్యె.

మ. కనుటన్ బ్రేమఁబెద్దజేయుటకు నాకాంక్షించుచుంటకాని నా
మనమందుండెడు కోర్కెఁదీరుపఁగ సన్మార్గంబు యోజింపదా
యెను మున్ జెప్పితి మౌనిపూజలన నాకెంతే ముదంబంచు నో
జననీ నీ కృపచేతఁదీరెనది, సాష్టాంగుండనై మ్రొక్కెదన్.

వ. అమ్మా అట్టిమహోపకారిమొసర్చిన నీమాటకునే నేమనుటకు
సందేహమేమికలదు.

శా. రాజ్యంబేలుట కష్టభాజనము సంప్రాప్తించుటే చుల్కనా
త్యాజ్యంబా నటువంటిదానికయి వ్యత్యస్తంబుగానుందునే
ప్రాజ్యంబౌమునిసేవను వ్విడిచి యీరాజ్యంబు నిమ్మందునా
పూజ్యంబౌపరమార్థ మిందమననే పొందంగ బోకుందునే.

క. ఇంకఁ దండ్రిమాటఁజెప్పెద
సకలంకగుణాఢ్యుఁడగుట నతిప్రీతిమెయిన్

వికలత్వమొందె ననువిడ
నకటా? యనృతంబుఁ బల్కఁ డమ్మా యెపుడున్.

క. తల్లియుఁ దండ్రియుఁ బిల్లల
కెల్లవిధుల సుఖముగూర్చ నెంతురు ప్రీతిన్
బిల్లల విడియుండుటయనఁ
దల్లికిఁ దండ్రికిని గష్టతమమగుఁగాదే.

తే. వృద్ధుఁడగుతండ్రి సుతులనుఁ బాసియుంట
కష్టతమమగు నెంతటి కఠినునకును
వెన్నబోల్ మనముగల నాకన్నతండ్రి
విరహదావాగ్ని నెట్టులఁ గరుగకుండు.

వ. నేనప్పుడే తండ్రిగారితో విన్నవించి పితృవాక్యపరిపాలన మొనర్ప జనని యొప్పించి వనికేగెద నమ్మా వల్కమ్ములిమ్మని యడిగి కొని ధరించి తండ్రిగారి సమీపమునందుండి యాతనిఁ లేపి వెఱ్ఱి చూపుఁజూచు దశరథునితో నాతఁడిట్లనియె.

హంసధ్వని — చతురశ్ర.

ప॥ సంశయంబిట లొందనేలనో జనకా దయగనుము ॥సం॥
అ॥ వంశమునకుఁ గీర్తికలిగెడు సంతసమున్ బినతల్లి తెలుపగ ॥సం॥
చ॥ కష్టంబేమియుఁగానరాదుగద కానకేఁగఁగా కొన్నాళ్ళుండి
యిష్టంబగునుండెదనుఁ బినతల్లియు నిదినాకుత్తమని గ్రహించి కోరెను ॥సం॥

వ. అనుచున్న రాముని వచనములం జెవిని విని యారాముని దశరథుండు బిగియారఁ గౌఁగిలించుకొని భరింపఁజాలని దుఃఖంబున నిట్లనియె.

సీ. కౌశికు సవనంబుగాచి కీర్తిఁ గడింపఁ
గ్రూరరాక్షసులను గూల్చినావు

పతిచేత శాపంబు వడసి బండగనున్న
గరిత నెప్పటియట్లు నరపినావు
ఎల్లభూపతులేగి యెత్తజాలని శివు
నిల్లుఁ జుల్కగ నెక్కువెట్టినావు
నన్నాహవానికా నన్నిచరించిన
పరశురామునిభంగ పరచినావు

తే॥ నీవలననేగడించితి నేఁగీర్తి
నీదుసామ్రాగు రాజ్య మున్నికొసంగి
పొందనుంటి సంతోష మో పుణ్యమూర్తి?
సాగనీదుకైక యికేమి సలుపువాఁడ.

మ. గుణవంతుఁడవు బుద్ధిమంతుఁడవు యోగ్యుండంచు పేరందినా
వినతుల్యుండవు విద్యయందఖిలలోకేశాంఢ పీవంద్రమ నా
యన? నాముద్దులతండ్రి? చేయిపయివేయఁగందు నీమేను నిఁ
వనవాసంబెటులంపి నేమనుదునబ్బా తీరె సంబంధముల్.

వ. అని దుఃఖించు దశరథునితో రాముండిట్లనియె.

ఉ॥ ఎన్నఁడు సూర్యవంశజులకేర్పడెనో కృతసత్యవాదులం
చెన్నగరాదు, కాని మనమెంతయుఁ బోషణసల్పఁగావలెఁ
జిన్నతనంబునాకనుచుఁ జింతిలి నన్వనికేగనీనిచో
జెన్నుగపూర్వులార్జనము చేసినకీర్తి నశించిపోవదే.

వ. కావున నోతండ్రీ? మాఱాల్మాటాడక సెలవిమ్ము నేబితృవాక్యపరిపాలకు
డను ఖ్యాతిగడించుకొనెదనన నేమియుననఁజాలక శిరఃకంపమొనర్చు
దండ్రియొద్దనుండి వెడలి కౌసల్యాభవనంబున కరిగి సందర్భమం
తయుచెప్పి నన్నాశీర్వదించి పంపుమన—

భూపాల—త్రిపుట

ప॥ నాయనా? నీవడవికేగెదవే । నాయనుంగుకొడుకా యయోధ్యాసన్వీడి

అ॥ బాయఁగలన నాచిన్నితండ్రి నే । బ్రతుకునే నీతండ్రియు న్నిన్ను న్విడిచి॥

మ॥ ప్రియంబా పసిదో తండ్రి య । రణ్యంబున నెట్టులుండెదవో
న్ప్రియమా ముగాఁడని పున్కైకకా । నయమున ని న్నిటనుంచంగోరెగను॥

సీ. మాటునఁగీయు కేముండఁదక్గలెపు నీకు
పరిచారికలు లేనివంటి బ్రతుకు
హంసతూలికతల్పమందు బండెడు నీకు
భూశయ్యయా! కటా! ముద్దుబిడ్డ
వేదముం గానమున్ వినిమెడు నీశ్రుతుల్
ఘోరమృగంబుల ఘోషవినుట!
పంచభక్ష్యమ్ములన్ భక్షించు నీకేన
కందమూలాదులో కన్నతండ్రి

తే. యెన్నఁడును నిన్ను గోపించి యెఱుఁగనట్టి
కైక యేల ని న్నిట్టులఁ గాన కనుపఁ
గంగణముఁ గట్టెనని నాకు శంకకల్గె
నౌర? విధిచైదముల నెవ్వఁ డరయఁగలఁడు.

తే. చక్రవర్తివి కాఁ దగు శంఖచక్ర
చిన్నములు మారిపోయె నా చిన్నితండ్రి
గురుఁడు పట్టాభిషేకంబుకొఱకు పెట్టి
నట్టి శుభముహూర్తం బరణ్యమున కయ్యె.

మంజరి

రామచంద్రబుధవర్యుల దూశి । ర్వచనంబుల ఫలమెల్ల
నా మహాపరాధములచేత నీ । నాటికయ్యెనా కల్ల॥

వ. అని యనేకవిధంబులం దుఃఖించుచుండ రాముడామెతో—

బిళహరి—జుల్వా

ప॥ అమ్మ నీవేమిట్టుల । నందువని కుందుదునే ॥న॥

అ॥ నమ్మ మినవంశమున । నాన్న కపకీర్తి రాదా? ॥అ॥

చ॥ నాకు హితవగుపని । నమ్మా కైక తెల్పెఁగదా
నీకేలభయమ్మమ్మా । నేకీర్తిఁ గడించెదనో ॥య॥

2॥ పదునాల్గేడులు నేఁ । బదునాల్గుఘడియలుగ
నిదె సల్పివచ్చెదనే । నేలనింక చింతిలనో ॥య॥

మంజరులు.

1॥ కావునఁ దల్లీపుత్రవిరహమునఁ గలతఁబడకు మోదముగన్
నేవెళ్ళివచ్చెదను సెలవిమ్మా ।నీవుంగూడ ముదముగన్

2॥ అనఁగనాపె శ్రీరామునితో ని । ట్లనియె దుఃఖసింధువున
మునిగి లేకలేక నిన్నుగని ఘన । మోదమునఁ బెంచుకొనిన

3॥ తలిదండ్రుల మెట్లువిడువఁ గలమో । తండ్రి యిట్టులవినుము
కలకాలము నీతోనుండు మనముఁ । గానకుఁ దోకొనిచనుము॥

తే. పెద్దకొడుకువౌ నీదటినిద్దరమును
గాలధర్మమందిన మేలుకాదె తనయ
నీవులేని యీపురమిఁక నిరయముగద
సుతుఁడనెడు స్వర్గమును బాయుచున్న మాకు.

వ. అను తల్లికి వెండియు రాఘవుండిట్లనియె.

తే. భరతుఁడిల నేలుచుండఁ దా మరయలేక
కొడుకుతో కానకేగె నన్కొండ్రుజనులు
నిందపడనేల దండ్రియు నీవుఁదీన
గొంతకాల మోపికఁబట్టుఁ డంతవత్తు.

వ. మరియు నోతల్లీ! యశాశ్వితములైన యీశరీరములు, కీర్తిమాత్ర
ము శాశ్వితమైనది ఈలోనెవ్వారి కేవారలగుదురో! యెవరివలన
నెవరు సుఖింతురో తెలియవశమే తలిదండ్రులం బుత్రుఁడును సుతు
ని జననీజనకులును విడువలేక సూర్యవంశమున కెల్లఁ గళంకమొన

ర్పదగు నన్నుతమాఁడికను నిండ పొందుటకంటె నన్వనికంపుటంతయు
సేమోదాయకము నామాటను మారాజక నన్నాశీర్వదించి పంపె
దేని పిత్రువాక్యపరిపాలనా భాగ్యంబందును నన నామె యిట్లనియె,
రామచంద్రా! దీర్ఘ కాలమైన నే నేమాశీర్వదించఁగలను. సుకు
మారుఁడవైన నీవు మత్తల్లికడుపునసైనం బుట్టిన సుఖించియుండు
వేమో యని కొంతసేపటి కూరటంజెందె నాయనా! నిన్ను సర్వదే
వతలుం గాపాడుదురుగాక. పోయిరమ్ము. అనిన నాపెకేఁరగి జానకీ
దేవితో నేతద్వృత్తాంతంబుం జెప్ప నేగుచుండ, దండతాడిత భుజం
గంబువలె నిశ్వాసించుచు రోషభీషణ లోచనుండై కేశంబులువీడ
బొమలుముడివడ రాముని కెదురువచ్చుచుండె

శా. రాముండే వనవాసమేగునఁట రారాజంట కైకాసుతుం
డేమీవింతలు సూర్యవంశమున నాయిట్లీదురాచారముల్
కామోద్రేకుఁడు రాజుగా బరగలోకంబిట్లు నిప్పచ్చరం
బామూర్ఖుండగు తండ్రిఁ జంపినను బాపంబంట దేపట్టునన్ ॥

క॥ అని పరుగిడు తన తమ్ముని
గనిరాముఁడు చింతఁ బడక గతమెరుఁగుటచే
ననుఁగన సీతనికెంతటి
యనురాగంబిదియ కాదె యనుజత్వమనన్.

మంజరులు.

1॥ అనుకొనివేగమెచని తమ్మునికర । మారామమూర్తి పట్టి
యనుజాయేమీ కోపకారణము । వినుచుము కోపమునెట్టి॥
2॥ ఎవరిమీఁదికికత్తిని దూయుట । వివరింపుము నెమ్మదిగన్
సవరణసేయన్ శక్తియున్నచో । సల్పెదనెదోవిధముగన్॥
3॥ అనియెడు సోదరునకు లక్ష్మణుడి ! ట్లనియెం గోపముకొంత
వెడుకొనవృత్తాంతంబంతః తెలిపెఁ । బీతిచున్నదన్నంత॥.

తే॥ అగ్నియనఁబడు లక్ష్మణునాగ్రహంబు
వర్షబిందువులగు రామవచన సరణిఁ
జప్పఁగానార్చి శాంతుని జంటనున్న
నెంతకోగ్రహమానసుండైన శాంతిఁ గొనఁడె.

మ. ఇనవంశంబునఁ బెద్దవారివిడి యెద్దే నీటి విస్తారముల్
వినియున్నారమె రాజరాజకటతస్త్రీలోలుండై చిన్నయ
న్నను రాష్ట్రంబున నిల్పి మిమ్ములనరణ్యంబుల్ చరింపంగఁబో
బనుపక్షత్రము నెట్లు త్రిప్పుకొనఁ జెప్పంగగోరు దీన్యాయమున్॥

వ. అనిన తమ్మునితో రామచంద్రుండిట్టులనియె.

ఉ. వంశపరంపరన్ మనకు వచ్చెడు కీర్తియు! సత్యమూల మీ
యంశమునందు నాస్నయిటనాడియుఁ దప్పినఁ గీర్తిపోవసా
సంశయమందఁబోకుమిది సత్యము యీాటను తండ్రిగారు నీ
యంశమునందు సత్యమునె యత్యధికంబుగ నెంచి పంచుటల్.

తే. ఏనికనేనేగ విపుఁదండ్రి ప్రాణములను
కోసలాత్మజపతి లేమిఁగోడుకుఁ గనమి
జింతఁబడు నాకుమా రామె చెంతనుండి
బాపు మాపుత్రిలోపంబుఁ భక్తిఁగొలిచి.

వ. మఱియు నోలక్ష్మణా.

చ. భరతుఁడు బుద్ధిమంతుఁడగు భ్రాతకదాయని నీవెరుంగుదం
చెరుఁగుదునేను నీవతని నెప్పటియట్ల తలంచి నాకడక్
గరముచరించు నట్లతనికార్యములం గడుభక్తి నల్పుచున్
తరణికులంబు కీర్తిశతధానిలఁ బెట్టుచునుండు సోదరా.

హంసధ్వని—రూపకము.

ప॥ భరతుని సేవింపుమయ్యా । భక్తితోనను గొలుచునటుల
అ॥ నిరతముసీకగు శుభంబు । నేనుపోయివత్తునయ్యా॥

మి॥ అరమరలేమియును లేక । నాతనికింగుడి భుజముగ
పరమోదారగుణుఁడనై । పరివర్తింపునేటి నుండి॥భ

చ॥ తలిదండ్రులసేవింపుచు । దమ్మునిఁ బ్రీతిగజూచుచు
కులమున కుత్సవమ్ము వెట్టు । గుణమును సంపాదింపుచు

మి॥ కలకాలముఁ గన్నసుతుల । కరణిని భృత్యులఁగాచుచు
పిలిచి పేదలంబెంచుచుఁ । బెద్దలపూజలొనర్చుచు ॥భ॥

వ. అనినయన్నకు తమ్ముం డిట్లనియె.

సీ. నీవాక్సుధారసం బీవీనులన్వీనం
జాలక వినియెదు సారమేది
భువనైకసుందరమూర్తినౌ నిన్ను నా
కన్నారఁగాంచ కేకరణినుందు
నీపాదధూళియే నిక సోకకున్ననా
యవయవమ్ములు వ్యర్థమనుచుఁదలతు
భక్తరక్షకనీదు పదసేవసేయక
బ్రతికియుండియు లేనివాఁడనగుదు

తే. భ్రాతృవాక్యోల్లంఘనముచే పాతకమ్ము
వచ్చి బాధించినన్సరే ప్రజలునన్ను
పాపిలక్ష్మణుడనినను భయములేదు
గాని నీవెంటరాకున్న నేనుబ్రతుక.

బెంగాల్ తోడి — త్రిపుట.

ప॥ అన్నా నేనెన్నఁడైన । నిన్నుపీడి । యున్నవాడనెచెప్పు ॥మ

అ॥ నన్నువీడి నీవడవికేగినచో । సున్నయే నాప్రాణమీమాత్రుటిలో॥

మి॥ సన్నుతగుణుఁడనై నసీపద । సరసిజములుసేవించుచు నీ
సన్నిధానమున నుండెదనటు । సమ్మతింపకున్నన్ రాకమాన ॥న॥

చ॥ జీవునకుఁ బరమాత్మునకుఁగల । క్రీవమనకీజోడుపాయదు
బోధివుమానను నాదుమాటల । పొల్లుగాభావింపకన్నా
మి॥ ఏవిధమునవైనను నీపద । మేగతియనినమ్మిన నన్ను
తావుననే వసియింపుమనుట । ధర్మము యీ దీనునింగరుణఁగావు॥ము॥

మంజరులు.

౧॥ అనియెడు సోదరుమాటలకు ముదం । బంది రామచంద్రుండు
కనుఁగనతోరిమ్మనునటుల సౌజ్ఞ । గనుపర్చెనఁ దమ్ముండుఁ॥
౨॥ దనతల్లియైన సుమిత్రిచెంతకుఁ । జని చనెదరాముతోడ
నన నామెయుఁసంపూర్ణమహాప్రీతి । ననియెనిటు కొడుకుతోడ॥
వ॥ పుత్రా లక్ష్మణా నీవు శ్రీరామునితో నేగుట నాకెంతయు సంతసముకాని.

క. సీతయువచ్చు న్నీతో
నో తండ్రీవారి చెంతనుండెడ వెట్లో
మాతాపితరుల నటువలె
సీతారాములకుసేవఁజేయుము భక్తిన్.

జంఝూటి — జల్వా.

ప॥ రాములంభజింపు ॥సీతా॥
అ॥ నీమమెపుడుఁదప్పక ॥సీరాము॥
చ॥ నన్నుగనీ జనకునిగానెన్నుము శ్రీతారాముల
చిన్నితండ్రియరణ్యమునఁజేరి కష్టమనక సీతా ॥రా॥
౨॥ రాముఁడెల్లలోకములకు । రక్షకుఁడనియెంచుమా
తామసమునుగుణమును నీ దఱినిఁజేరనీక ॥సీతారా॥

క. అనిపలికినఁ దనతల్లి
న్మనమున గడుమెచ్చుకొనుచుఁ మానగుభక్తిన్.

జననీవందనమని వే
జనె రాముండేగినట్టిజాడఁ జూడన్.

వ. ఈలోగా శ్రీరామచంద్రుండుఁ దనసతియగు జానకితో నేతద్వృత్తాంతంబెల్లం జెప్పవలెనని-

మంజరులు

౧॥ తూగుటుయ్యాలలో నూగుచున్న । తొయ్యలిచేంతకుఁజనియెన్
ఏగతి నీగిరతవిడిచిపోవుదు । నిప్పుడనిచింతఁగొనియెఁ॥

౨॥ కోటిమన్మథాకారుఁడైన యా । కోసలాత్మజ కుమారుఁ
సాటిలేనిప్రేమఁగని యూగుటఁ । జప్పునఁదిగి దరిఁజేరెన్॥

౩॥ ఊయలఁదిగి సాష్టాంగియై సీత । యుప్పుగ పతిపదములకున్
పాయనిప్రేమన్ వందనంబని ప్రి । యాయిటులే మనుపరకుఁ॥

వ. నాకాపా యాంబరంబులఁగని యిదేమని యడుగుచున్నదికదాయని భావించి-

క. పినతల్లి వరములడుగుట
జనకుండిచ్చుటకు రామచంద్రుఁడు తమ్మున్
వెనువెంటఁదోడుకొని తా
వనమునకరుగుటయుఁబల్కెఁ బద్మేక్షణకున్.

తే. రాముఁడిట్టులఁబలుక నారాజవదన
వాలుఁజూపుల్కలఁదన పతిపదసముఁగని
సంతసంబెంతయుంజూపి జాలివొడమ
దెలిపెఁదనకోర్కె నిట్టులఁ దేటపడగ.

కాఫీ—త్రితాల్

ప॥ సంతోషము మ్మెనునాథా । మదికి ॥సం॥
అ॥ కాంతారమునునేనుఁ । గా చఁగలుగుటచే ॥సం॥

చ॥ కాంచుమునివరులఁ గైకమ్మదయవలన ।
గాంతుఁడసీతోడఁ గాంతారమునసుండ ॥సం॥

॥ మనసౌమిత్రియు మనతోనుండుట
మరియునుమోదంబౌనో నాథా
ఇనవంశంబున బుట్టినమీరిటు
లెంతయుఘనమగు పనినేచేయుట ॥సం॥

వ. కనికరమునుఁగాతి వ్రాత్యమును దోపఁబలికిన తనపతిం దలపోసి శ్రీరాముం డిట్లు యోజించె.

సీ. సకీరుసన్ జరియించు నీ కోమల
చరణకటికిరాళ్ళ తరులమోళ్ళ
నేకీతిగాంచు నీయిందీ వరదళాక్షి
కూరమృగంబుల ఘోరచేష్ట
లెటులఁ జరించు నీమృదుగాత్రి యడవుల
చండభానునివేడి యెండలకును
నెట్టుల మెసవు నీమృదులాన్నభోజని
యాకు లలంబు ల య్యడవియందు

తే. సకలసౌభాగ్యములనందు సౌఖ్యజీవి
కారడవిఁ దాళఁగలుగు నే కష్టములకు
నన్ను విడియుండనోప దీ యన్నుమిన్న
యేమిచేయుదు విధిచైద మిట్టులుండ

వ. తనలో నిట్లు యోజించుకొని జానకితో నోజానకీ! యరణ్యము నయోధ్యయనుకొంటివా! మిథిలయనుకొంటివా! సింహశార్దూలాదిమృగయుతంబై, యొక్కొక్కచో నిలువనీడయైన నైక, నొక్కొక్కచో కాలిడుటకైన నీవులుచిక్కని కంటకసిలా

యుతధరాతలంబై, దాటుట కసాధ్యంబగు సెలయేళ్ళతోడం గూడి యుంటు. నీవా! సుకుమారివి—

తే. నవరసాన్నంబులును రత్నహారములును
సేవలను జేయునట్టి దాసీజనమును
దూగు టుయ్యాలలును మంచి భోగములను
మాని నావెంట రానేల కాన కనిన.

వ. సీత యిట్లనియె.

తే. పంచభక్ష్యములును వెలమించు నగలు
సౌధములును నుయ్యాలలు సఖులు మణులు
పూజలునుఁ గూడి పతికంటె ముఖ్యమగునె
కాంతునకు మించుకొటులు స్వర్గంబె యైన.

ఫీల్వా—ఏక

ప॥ నన్నుఁ గొనిపొమ్ము నాథా । నీతో ॥న॥

అ॥ చిన్నతనమంచు । నెన్నకఁ దప్పక ॥న॥

చ॥ నిన్ను వీడి నే మనగలనా నీ
కన్న నెన్నేని । ఘనమగునా ॥న॥

౨. సన్నుతమునిజన । పన్నగశయనా
నిన్నెఱుంగనే । నీరజనయనా ॥న।

తే. చిలుక గోర్వంకలట్టులఁ జెలువుఁడు ? సతి?
కలసి కానసుండినను స్వర్గమగుఁగాని
వీడినపుఁ డెన్ని సౌఖ్యముల్ గూడియున్న
నరక మంతకన్న న్వేరెనాథ? కలదె.

తే. విసము, పతిలేక తిన్నపాయసముసతికి
వనము నాథుతోలేని పట్టణము విదకు

.రోగము ధవుఁడు లేనప్డు భోగమతివ
కగుననుచు మీార లెఱిఁగి యిట్లనుటమేల !

క. అని నాథుని పాదములను
గనికరముం దోఁపఁబట్టి కన్నీరొలుకన్
ననుఁగూడఁ దోడుకొనిపొ
మ్మనఘా లేకున్నఁ బ్రతుకనన విని పతియుఌ.

వ. సతిరాకకు సంతసించి సమ్మతింప నచటికి లక్ష్మణుండు వచ్చి వదినె యగు జానకీదేవియుం బయనమగునని తన తల్లి చెప్పినట్లయ్యెనని సంతసించుటయు నామువ్వురునుం గలిసి కైకకడకేగి సెలవిమ్మననాపె సీతాలక్ష్మణులకుం గూడ కాషాయాంబరము లీఁ దలంప వశిష్టుండటనుంటచే జానకికి వలదని యాఁపె.

తే. తత్క్షణంబన్న తమ్ములు తల్లియిడిన
యంబరంబులు ధరియించి హారములును
నగలు సీతనగలుకొన్ని వగపులేక
పేదసాదలకుం బంచిపెట్టి పిదప.

వ. జనకునకు మ్రొక్కి పయనములగు వారలగాంచిన జను లయ్యయ్యో రామచంద్రప్రభు నన్యాయముగ కైకవనవాసంబునకుం బంపుచున్నదట, అట్టిప్రభునిఁ బోఁగొట్టుకొన్న మనము దక్కెదుర్తిలము గామేయని, కోటచుట్టుం జేరి.

సీ. జగదేకవీర నీ జననంబురోజునఁ
జనులెల్ల నీసొత్తుఁ దినిరికాదె
అన్నముసృష్టించునపుడు నీపేరున
సత్రముల్ తగ సృష్టిసలుపఁబడవె

అక్షరాభ్యాస మీవందినయపుడెల్ల
వృత్తి విద్యల శాలలేర్పడెగద?
పెండ్లిచేసుకవచ్చి యిండ్లలో దిగునాడు
జన్మలం దగ్గించి ప్రేమతోఁ గొనవె

తే. ఈవుపుట్టి నె౦కర్లకు నెన్నొమార్లు
వేతనముల హెచ్చించవే ప్రీతితోడ
పేదసాదలకై నీవుపెట్టినట్టి
నిత్యజీవనవసతు లెన్నెనిఁ గలవు.

ముఖారి—త్రిపుట

ప॥ అట్టి నీవీపట్టణమువిడి । యడవికేగెదె రామచంద్ర

అ॥ ఎట్టులేమికఁ బ్రతుకఁగలుగుదు । మేమొనర్తుము నీతిసాంద్ర

చ॥ పట్టణమికఁ నీవుండనిచో । నట్టడవియె యానోరామా
యెట్టులమమ్మందరిని విడిచి । యేగెదవో సద్గుణధామా॥

సీ. రామచంద్రుండేలు రాజ్యముం జూతమం
చున్న వృద్ధులు నేడునున్న యెకద
కప్పముల్ రాముని కప్పగించెదమని
సందడిపడు నృపుల్ కుందుటెకద
శక్తిగోలుఁది రామచంద్ర! నీకీనున్న
కట్నము లేక మూటగట్టుటెకద
దేశముల్ దాటి నీ దివ్యోత్సవముఁ జూడ
వచ్చెడు ప్రజకోర్కి వ్యర్థముకద

తే. నీవులేని యయోధ్యయే నిరయముకద
బహుజనుల్ నిన్నుఁ బాసిన బ్రతుకరు కద

గ్రంథాలయం

నీతి నీస్పర్శలేకున్న నిలువమిక దె
పోయెదే వని గుణసాంద్రి పూరుషేంద్రి,

వ. అని దుఃఖించుచు ప్రియాణమగు రామునకు కెదురువచ్చి మమ్ము విడిచి పోయెదవా! రామా ?...

మ ం జ రి

అనిమెను జనులను నేర్పుగా సమా । ధానపరచి దాశరథి
తనజనకుని సచివుండగు । సుమంతుని గని యి ట్లనియె గుణనిధి॥

వ. సుమంతా? ఈజనసముదాయమునుండి నడచియేగుట కష్టతరంబు గావున తేరుం దెచ్చిన సులువుగా నరుదేరనచ్చు నట్లు సేయుమన రామునిం జూచి దుఃఖ మినుమడింప నణంచుకొని రామాజ్ఞ నెఱ వేర్చ నావచ్చినరథంబుపై సీతారామలక్ష్మణులధిష్ఠించిన యనంత రంబు రాముం డోసుమంతా రథముం గదలిపో నిమ్మని రథంబును నడిపించు సమయము నం దనకు వందనము లొనర్చు నెల్లవారల కొక్కమారు తనచేతులెత్తి సౌంజ్ఞంజేయుచుఁ బురజను లిట్లు విల పించిరి___

ఉ. శ్రీరఘురాముఁ డేగుతరి చింత మునింగిరి యెల్లవారలున్
హా రఘురామ వీరపురుషాగ్రిణి, హా జగదేక సుందరా
కార, గుణాఢ్య, సజ్జన, యకల్మష, సర్వజనానుకూల, హా
హా, రమణీయవాక్య, విరహాంబుధి మమ్ముల ముంచి పోవుదే.

తే. రామచంద్రుండు రథమెక్కి రాగమొప్ప
నడవికిం జనునప్పుడా యవనిలక్ష్మి
రామచంద్రునిఁ గొంత దూరంబుపంపి
తోకచుక్కయై లంకలో దోచె నపుడు.

వ. సీతారామలక్ష్మణులట్లతిత్వరితగతి సుమంత్రునితోపాటు రథంబ ధిష్ఠించి పురంబుఁ గడచి మొదతెగనివంత నెల్లవారలకుం గల్పించి పురజనుల తల్లడంబునకుం జింతించి తమవారికొఱకును సౌఖ్యము లకును మనంబులం జొరనీయక యపరిమిత్తులై జనునయ్యవసరం బున శ్రీరాముని విడువవలసివచ్చునని సుమంతుండు బాష్పపూ రితలోచనుండై చింతాక్రాంతచిత్తుడగుట జంచలమనస్కుఁడై కేవల విగ్రహప్రతిమానుండై గ్రహావిష్టుని వడువున సంకల్ప వికల్ప శూన్యుసటు, నిశ్చేష్టుఁడై వివశతచే సవ్యాపరునంబుల కెల్లం బులవదలినను, సవిమాత్రమపరిమిత్తములై సాయంసమయమునకుం దమసానదిం జేర, నటబూరోక్తప్రకారమూ యయోధ్యాపురజనం బులౌరౌరా యింత చేసిన కైకంజీటినం బాపమున్నదే చీఛీ యీఁడు రాత్మురాలు స్వలాభముంగోరి ధర్మేతరయై తనసుతుండే రాజ్యమే లునో లేదోయనియెనం దలంపకఁ గొండమచ్చునాటి గూసిమం ధరమాటనమ్మి సపత్నియైన కౌసల్య కపమానముంజేయనెంచి పట్టు దలవహించి ధర్మస్వరూపుఁడై దీనరక్షకుఁడై న్యాయమూర్తియై నిష్కపటియై యీభూవలయంబున కెల్లం గర్తయు భర్తయు నగు రామచంద్రు నడవికంపినదిగదా యనువారును ఔరౌరా? 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతక' యని యెఱింగియు నీబడుగేల తెలిసియుం డక వరములిచ్చెననువారును, పోనిండు పోయినసీటికిక్కేల భర తుండువచ్చిన నాతఁడే రాముండోక్తెచ్చి యాతనికే పట్టంబుంగట్టుం గాని తానేలునాయనువారును రాముఁడు వచ్చువరకు నన్నపానీ యములుమాని వాయువుండిని బ్రదికిన బ్రదుకుదుము లేకున్నం జత్తుమని భీష్మించువారును, నైయుండ మఱికొందరు శ్రీరాముని వెంటంబోయి యీయడవిలోనే వసింత మూ మహానుభావునిం

గాంచుచున్న వారి కన్నపానములేలయని బయలుదేరి పరుగులిడు వారు నగుచు సీతారామలక్ష్మణులుచేరిన తమసానది కాయర్థరాత్రింబునకు చేరి రథమునగపడుటచే రామాదు లచ్చోటనున్నట్లు తెలిసికొని యినుమంతదూరంబుగ నదీసమీప భూరుహచ్ఛాయల మాయామయమగు నిదురంజేయుచు స్వప్నంబులంగూడ రామప్రభుని వెంటనేగుదుముగదా యాతంపురానీకున్న నాతనిపాదములకైన నమస్కరించి యేగుదమనుకొనుచు ప్రయాణాయాసములచే నించుక కన్నుమూదప్పి రప్పట్టున రామచంద్రుండు జాగ్రదవస్థయందున్నవాడగుటచే తనలో నిట్లు వితర్కించె. నాహా మనయయోధ్యాపురవాసులు నాయందుండు భక్తిచే నిచ్చటికి నాకొఱకై వచ్చియు నాకు నిద్రాభంగమగునని దూరంబుగాం బరుండిరి. వీరలెంత యాగిలింగొని యెంతయలసియుండిరో నన్ను వీ రయోధ్యకురమ్మనుటకో నావెంటవచ్చుటకో తలంచుచున్నారు. అట్లుకోరునప్పుడు నేనువారినొడిచి యేగుటకంటె నీయర్థరాత్రింబుననే వీరెవ్వరికిందెలియకుండ సీతమసానదిందాటిపోవు టుచితము గా దోచుచున్నయది నాయందు వీరలకెల్లరకుంగలభక్తి యపారము ఉదయమునకు గంగానదింజేరి వీరెల్లరకుం భరతుని నన్నుగా సేవించుచుండుమని సుమంత్రునిచే వర్తమానమంపెదంగాతమనుకొని సీతా లక్ష్మణ సుమంత్రుల కావిషయమెల్లం జెప్పి నాసల్వురును తెల్లవారు సరికిం బరమపవిత్రయగు గంగానదీసమీపమునకుం జేరి యటంగల్గు నింగుదీ వృక్షచ్ఛాయ నవిశ్రమించిరంత.

చ. కరియెను లోకరక్షకుని గంజదళాక్షుని దీనబంధుసి
జననుతపాత్రుసిన్ బరమశాంతమనస్కుని జానకీపతిన్

మునుటిపడైన జన్మములఁ బోహణ జేసినమంచి కర్మవ
ల్లను జననంబు నందిన ఫలంబునసుం గుహుఁడ న్ప భక్తమై

వ. కాషాయాంబరధారులైన యవ్వారల నెల్లరినిం గాంచి సుమంతుని వలన సంగతి యంతయు విని యద్భుతంబు చెందుచు రామునితో చేతులు జోడించి యిట్టు లనియె.

జంఝూటి—చతురశ్రి

ప॥ రాగిపవో దచాదనాదిన నీ

అ॥ బోగిము పొగడయే । ల్యాను వచమాానె ॥రా॥

చ॥ తేగిమంగినో । తండి నీదే
వోగులకైనను । వాశముపునే నీ ॥రా॥

చ॥ రా చిప్పైమోస । రాజ్య మిడిసితిసి
యూచుకపు పర । మేచుకపు నీవె ॥రా॥

ఆ. పోనిలెండి యిప్డు పుట్టిమి మునిగింది
మాదు బూమియంత మీదె లెండి
యేలుకోండి మేము యెల్లరమును మీకు
సిత్తమొచ్చినట్టు సేచుతాము.

వ. మాపబో మాపల్లెకోగ్గంతా నామా టింటారుగనక మా బూము లన్నీ మీ రేలుకోండి మాయందుకే మీ మీద బత్తుంది మాపబో మీకేం బయము లేదండి.

హిందూస్థానీ—మంజరి

కైకమ్మ గియికమ్మ దచరదుండు గిచరదు డి
క్కడ వొక్కట అదుగైన బెడతారా
యేకరిమ మెరిగిని మీకే యిలా జేత్తే
యితరోళ్ళి యిక బతకనిత్తారా

యేమేమైన చరే యీబూమినంత చీ
రామ నుప్వే వేల వల్చిందే

నామాట మీరితే నను సంపుకున్నట్టె
రామా యిందుల కేనంటావు

కమపుని బుట్టిన కొడుకు నిలా సేత్తే
కడనోళ్ళగతి యింకేముంది

యిడుములు పెట్టేటి యీలాంటి వోడికి
పుడతమే. తప్పు మీయంటోరు.

మంజరులు

౧॥ ఇటులఁబల్కు గుహునితో రామచంద్రుఁ డెంతయుం బ్రీతితోడ
నిటలనయనునిచ్ఛఁ దాటఁగలమే । నిజముగాఁ బల్లెనేత

౨॥ నీకు నాయెడలఁ గల్గు ప్రేమకే ! నెంతయు సమ్మదముఁ గొంటి
వీకమాని నే నడవికేగఁగా । వేగమె శలవిమ్మంటి?

3॥ ననుఁ జంపుకొనిన యట్లంటివినే । నా? రాజు నీక్షణమునన్
మనుజేంద్రుఁడ నగుట నే ననినటులఁ । బనిసేయు మీయదునునన్

సీ. తల్లిదండ్రులయందుఁ దప్పులేదించుక
వారలనిందింపవలదుగుహుఁడ

అడవిఋషుల సేవనాచరించుటకంటె
రాజ్యమేలినలేదు ప్రాభవంబు

క్రోధాదిగుణములుఁగూడ వడవినుండ
నట్టివో కష్టమంచడలనేల

వచ్చెదఁ బదునాల్గువత్సరములుఁదాట
నప్పుడేలుదును రాజ్యమందరిక్కృప

తే. గల్గుచో గాసమారాడఁగా జనకుము
నన్ను (భీ)తితో దాటించు నావనిప్డు
నీదుదయఁ బితృవాక్యంబు నెఱపుకొనఁగ
గోవునాఁడభక్త గజేంద్రబుద్ధిపొందగ్రి.

వ. అనినరాముని యాపల్కులకు మారుపలుకంజాలక 'నీయిట్టంమా ప్రభో' యని 'మొక్కచుండేయఁమా త్రవుండి సిత్తగించండి'

చ. తమపదధూళియే చిలకుదాకిన స్త్రీయయిపోతదంట శా
త్రములలో కట్టలూచిలలు దగ్గిరిబందుగులంట మీరు ప్రా
ధమునిడ నావకూడ వొనిత్తైనసొ? నాబతుకోద్దిబాబు సి
త్తముప్రధధూళినిక కడిగి దాటగజేసెద నావ చీగ్రమే.

వ. అనిన గుహునిభక్తికిమెచ్చి మందస్మితముసేయ నంగీకరించెనని శ్రీరాముని పాదంబులం గడిగి తజ్జలంబునం జల్లుకొని సీతా రామలక్ష్మణులను, సుమంత్రుని, నావనెక్కించుకొని యిట్లు పాడం దొడంగె.

పడవపాట.

రాములవొంటి బుద్ధిమంతుడు । శంబన్నాతోయిరాపడవ
రాజ్యంవంతా యెతికినాను । కెరటమొచ్చెకాసుకోరా
దూరదేచం తిరిగినాను । తెడ్డువెనయెయ్యరోరి
దొరుకుతాడాసూసుతారా । మెరకమెరకసూసుకోర
కట్టమెరగనిజానకమ్మ । శంబన్నాతోయిరాపడవ
కాణలోకి యెళ్ళవాలిసె । తెరసాపైనయెయ్యరోరి
సిన్నదొరకిపెద్దదొరకి । ఒడ్డుగాయిఒడ్డుగాయి
సేహమెంతోసూసుకోర । శంబన్నాఆపరాపడవ

వ. ఇట్లుపాటంబాడుచు నవ్వారిని గంగందాటింపఁ రాముఁడుదన సిరో జంబులం జడలుగాజేసికొని యోగిగా నెంచి యానిషాదనాథుండగు

నాతం డాశృంగిబేరి పురంబునంగల మఱ్ఱిపాలందెచ్చి యిచ్చిన రా ముండు దన సిరోజములకు రాచుకొని జడలుగా జేసికొని నేను పదునాల్గు వత్సరంబులవరకును పట్టణంబులం జూడక నారక పితృ వాక్యపరిపాలనం బొనర్చెదనని శపథంబొనర్చినప్పుడు—

శా. రాముం డట్లుగొనర్ప లక్ష్మణుడు హర్షంబంది తానట్లయై
యీమాకానన వాసమేగువరకు న్నేనిగ్రహారంబు నిం
తే మానన్వలెనంచు నెంచుకొని భక్తిం దాను గంగానదీ
సామీప్యంబునఁ బర్ణశయ్య నియమించంబండె రాముండటన్.

ఆ॥ పండుకొనుచు రామభద్రుండు మంత్రిని। జేరఁబిల్చి ప్రీతిఁజెప్పెనిట్లు
భద్రమీవు పృథ్విఁబాలించి ప్రజలను।బిడ్డలట్లు ప్రేమ బెంచుమనుచు

వ. మాభరతునకుం జెప్పి.

తే. నన్నుప్రేమతో గనవచ్చియున్న జనుల
మార్గమధ్యంబున న్నీవు మరలజేసి
నేను పురికేగుడని చెప్పినానటంచు
తేరుకొనఁబల్కి పురికేగదివురుమయ్య.

జంఝూటి—చతురశ్ర

ప॥ చనుమాసుమంతా । చింతిలక

అ॥ ఘనవన పర్వత । నదులందాటుచు
గడపివచ్చెదము పదునాల్గేడులు ॥చ॥

చ. తండ్రిని తల్లులనెటు చూచెదవో
తమ్ముల నెటుకాపాడెదవో తలి
దండ్రిలు బిడ్డలగనినాటులు ప్రజా
తతిఁగాపాడుము చింతనువీడుము॥చ॥

వ. అనిచెప్పి గుహునివలన నరణ్యమార్గంబెఱిఁగి యటనుండి బయలు దేరి,

సీ. నడుమ లేకుండి యున్నమొదుదాని విధాన
బతిచెంతఁ దాఁగనుపడెను సతిని
గ్రహియించి హితపువాక్యముల నాపెకుఁగష్ట
మునపింపకుండగా జనుచుమూఁడు
యోజనంబులు దాటియుక్ సుగన్ననగో
నరము చెంగటనుండి మరునటిదిన
మున యోజనత్రియమున నుండినట్టి భ
రద్వాజు నాశ్రమరంగమైన
తే. గంగయమునయు నీరెండు గలియుచుండు
నట్టి సుక్షేత్రమైన ప్రయాగమునకు
చని భరద్వాజు నిన్ననాల్ నలిపియతని
తృప్తిపరచి యందుండిరా దినముఁరాత్రి

మంజరులు

1॥ భరద్వాజుచే సత్కృతులై గీ । వనలంగదిదాశరథులు
మరుదినమునఁ జిత్రకూటమునకై । యరిగెదరని తాపసులు॥
2॥ దారిఁజూపనేగి రాజ్యసుఖముక్ । మీరిన యట సౌఖ్యమ్ముల్
సూరిజనులైన వారనుభవించు । చుండిరికొన్నిదినమ్ముల్॥
తే. పర్ణశాలను నిర్మించి ప్రమదమలర
నుండిరొకనాడు కాకాసురుండు సీత
వక్షమున బొడువగ రామభద్రుడలిగి
తృణము మంత్రించియేసినఁ త్రిభువనములు.
ఆ. తిరిగి దిక్కుగనక ధీరుడా రాముని
పాదములకు మ్రొక్కి పాపినైతిఁ
గావుమనిన నీదు కన్నుస్త్రమునకిచ్చి
పొమ్మ బ్రతుకుదనినఁ బోయెనతఁడు.

వ. పిదప వారడవియందుండి రప్పఁగ సుమంత్రుఁడు.

మంజరులు.

1॥ సుధారసమొల్కఁ బల్కు-రాముని । సుమంత్రుండు వీక్షించి
విధాతరాముని మంత్రిత్వమునం । బెట్టడమసన్నని యెంచి॥

2॥ ఎట్టకేలకచ్చటినుండి కదలి । యేఁగెరథమెక్కి-వేగ
మెట్టులేగె రాఘవుండనుచుఁ బె । క్కేఁడ్చుజనుల లెదురురాఁగ॥

3॥ కోసలసుత నందనుఁడన్న తెఱఁగు । గునువారికి విన్పించెఁ
వీసమేని మాటాడకయెప్పురం । బేగమళ్ళి రతికించన్॥

వ. అట్లు మార్మాటాడక రామాజ్ఞప్రకారం బానర్పసాగిన జనులంగని సుమంతుం డాహా! రామునియందీ పురజనులకెంత భక్తిగౌరవము లున్నవని మెచ్చుకొనుచు.

తే. పురజనులకన్న ముందెతాఁబోయి పురము
దశరథుస్త్రీఁ గనుఁగొనవలచి పిలిచి
యడుగ నొకసేవకుండిట్లు లనియెమిగుల
భయము భక్తియుఁ బెనఁగొన భావమందు.

మ. యువరాజేగెనె కానకంచు నిది విధ్యుక్తంబుగాదంచు నే
నెవఁడో తెల్పుఁడు వేగమంచు కనుమబ్బెస్వప్నమేమో యటం
చవతారంబులఁదాల్చి నాకొడుకు కైకామ్రిక్కఁద నీక్కటం
చునచింపం జనులెల్లఁ భీతిలవశిష్టుండాఁగెఁదే వేరులన్.

క. అనిసంత నాసుమంతుం
డినుమడిదుఃఖంబు గలుగనిటుతలపోసెన్
తనయుని ననమునకింపిరియె
చనుదెంచితె యనిన రాజసతికేమందున్.

వ. అనుకొనుచుఁ బోవకఁ దప్పునేయని భావించి మెల్లమెల్లన [illegible]

శుని దఱికేగ నాతండు సుమంతునీక్షించిన తక్షణంబు బొటబొటం
గన్నీరుం గార్చుచు నాతనిం గౌగలించుకొని యిట్లు విలపించె—

ఆనందభైరవి—చతురశ్రి.

ప॥ రామమూర్తి సడవికంపివచ్చితె। నాముద్దులపట్టియని యెఱింగియు
అ॥ ఏమిటో చదీ ప్రాణముబోవదు। ఎట్టులభరింతు నీసుతవిరహము
మి॥ ఏమనుకొనుచుండిరో కొడుకుఁగోడఁ। లేమనిసౌమిత్రిదూరుచుండెనో
కామాంధుఁడఁ బాపాత్ముఁడ నీచుఁడ। గాకున్ననిట్టి పాపమొనర్చెదనే
చ॥ కటికిరాల నాబిడ్డలపదములు। కందినవేమో కటకటా సీత
చటుల భీకరంబగు మృగములఁగని। సంతాపముబొందుచుండెనేమో
మి॥ నిటలలోచనుడుదయలేక యెన। న్నీచమైనజన్మమునెత్తించెను
కటకటా కడుపుబిడ్డలగుచుండె। ఖండింపఁడు నన్నీక్షణంబుననే॥

సీ. రామాయనెడు నక్షరద్వయంబును విన్నఁ
బులకాంగుఁడగు నెట్టిపురుషుఁడైన
రాముని దర్శించిరాతత్క్షణంబున
స్మృతినిదప్పుదు రెట్టి చెడుగులైన
రామమూర్తి మృదూక్తులే మానవులువిన్న
ధర్మమార్గమ్ములం దగిలియుందురు
రామచంద్రునిస్పర్శ రవ్వంతయైనను
స్వర్గమంచెంతురు సకలజనులు

తే॥ మధురనాముఁడు, దైవసమానుఁడు, మృదు
భాషి, మదనకోటి సమాంగభాసుతుండు,
సర్వసద్గుణ పేటిక, సర్వసముఁడు,
నట్టి బుద్ధిసాంపుని పని కనుపుకొంటి.

వ. అనుచు మతిచలించినవాఁడై విభ్రిమమున-

శా. హాహాహా! రఘురామ! రావ కనవా! హా! కైక శ్రీరామునిన్
బాహా విక్రమధుర్యుఁబంపవని, కబ్బా! లక్ష్మణా! శత్రుసం
దోహంబుంగడతేర్చుచుంటె వనమందుల్ సీతయేమయ్యెనో
హాహా! రాముడ! రమ్మతండ్రి! గుణవర్యా! నన్నురక్షింపగన్.

వ. నెట్టిచూపులంజూచుచు నిట్లనుచుం గొంతసేపటికి తెల్విఁదెచ్చుకొని కౌసల్యతో నిట్లనియె నోకాంతా నల్వురుపుత్రులుండియు నేనొక్కసుతుండైనఁ జెంతలేక చావవలసిన శాపంబొండుకలదు దీని న్వినుము.

సీ. శబ్దవేధినిగాన జంతుబాధితులునన్
రక్షింపుమనికోరఁ దక్షిణంబ
పోయి యాజంతుసమూహముం జెండాడు
చుండఁగా మౌనిపుత్రుండొకండు
వాహినిజలమును భాండముతో ముంచు
చుండంగ నేజూడకుండ నచటి
శబ్దంబు నేనుగు జలముఁద్రావుచునుండ
వచ్చినదని బోధపరచుకొంటి

తే. యోజనాశూన్యతముఁడనై యురముశరుల
నేసితిని యలుగవుడా మునీశసుతుఁడు
హరహరాయని నేలపై నొరుగఁదెలిసి
త్వరితముగనేగి వానితోఁ బలికితినిటు.

శహాన — రూపకము.

ప॥ తెలియకననుఁగొట్టినాడ । ద్విజవరననుఁగావుమయ్య
అ॥ తలపకుమెఱుఁగుదని నీకు । దగినశాంతిఁజేతునయ్య॥
చ॥ తలచుచున్నిన్నునాసుతుగా । తప్పకిపుడు దయసేయుము
జలమునఁజప్పుడునేటికి । సలిపితివో యీకృత్యము॥

వ. అనిన నామునిబాలుండు రాజా నాప్రాణములుండవు నన్ను నీవు కొనిపోయినను బ్రయోజనము లేదనిన భయమంది యిట్లంటి.

సీ. బ్రహ్మహత్యాదోష భారము నన్నొడి
బోవుమార్గముఁజెప్పి కావుమయ్య
సదువృత్తాంతము నీవుఁదలంచితినయ్య
మునిపుత్త్రియనినంతఁ గనికరంబు
తోపఁబల్కెనిటులు భూప నేశూద్రవ
నితకువైశ్యునివల్ల సుతుఁడనైతి
నందుచే బ్రహ్మహత్యాదోషమంటదు
నాతల్లిదండ్రు లనాథులును ము
తే. సలులు నంధులు గనుక నచ్చటికిఁబోయి
దాహపీడితులగువారి దప్పిఁదీర్చి
నానమస్కృతులని చెప్పి నాకువలెనె
సల్పుపోషణమిడె కపసారిమాలు.

క. అనితెలిపి ప్రాణములువిడఁ
జని యాతనిగుర్వులుండుచోటఁ గని వా
రిని సంబోధించుచు నే
వినిచితిసర్వంబు వారు వినియనిరిట్టుల్.
తే. పాపమెఱుఁగని మాబిడ్డఁబాసితీవు
మేము మేన్వాల్చి బ్రతికిననేమిఫలము
తలపనంధులమముఁ జిన్నతనమునుండి
విసుపుఁజెందక పెంచిన ప్రియసుతుండు.

క. పరమోత్తమగుణుఁడగుమా
వాపుత్త్రునిఁ జంపినావు వత్సలునీకుం

బరగియును జెంతలేక యు
మరణించెదవంచుఁ దుదకు షాపమిశపించెన్.

వ. అని యమ్మునిదంపతు లిర్వురునుం బుత్రవిరహానలమున కోర్వలేనివా రగుట నాక్షణమే ప్రాణములవిడిచిరి. ఆశాపంబున నేనును సుతుం డొక్కండైనలేని యీగాసముయమునఁ జానకతీగనయ్యయ్యో యెంత మరతుమన్న నాసుతుండు మరపునకు రాకున్నాఁడు.

తే. రమ్ము నీకిచ్చెదనుసుతా! రాజ్యమంచు
జెప్పినపుడుండు నానుతుచెల్వు మరలఁ
బొమ్మువనవాసమని కైకపుచ్చినపుడుఁ
గూడ మారదే దాతని గుణమె గుణము.

భాగేశ్వరి—త్రిశ్రగతి.

ప॥ పంపుడతనితోడనూ । భాగవతోత్తముండతఁడు
అ॥ సొంపుగుల్కునట్టి నా । సుతునివిడిచి బ్రతుకఁజాల॥
చ॥ పోవుచుండెఁ బ్రాణమిపుడె । పుత్రునిపై యాసతోడ
నావరాలమూట వనికి । నడచెనె నాకిటచిచ్చిడి॥

మంజరులు.

౧॥ అనితెలుపుచుఁ రామాయని ప్రాణము । లనువిడిచె దశరథుఁడు
కనులనీరు ధారాపాతముగాఁ । గారగా సుమంతుండు॥
౨॥ రాజాయని పెద్దకేకఁ బెట్టిన । రాణులు చాలనవలిరి
భూజానీ నాథాయని శోకము । పొంగి పొరల నేడిచిరి॥
౩॥ వశిష్ఠుం డెల్లవారలను శాంత । పరచి కొంతసేపటికి
దశరథుని మృతకళేబరంబునున్ । తైలమునముంచఁబలికి॥

ఉ. రాజ్యము రాజులేక గృహరత్నములేక గృహంబు న్యాయమా
ర్యాజ్యము సౌఖ్యముండక వియన్మణిలేక దినంబుఁ బెండ్లివిం

రాజ్యములేక సూనృతమునాడక కీర్తియు నిక్కువంబుగా
పూజ్యతఁ బొందఁ జేవు గుణపూర్ణ! సుమంత! మఱింక లాభమా.

వ. కావున నరాజకముగా రాజ్యముండు టనుచిత మిప్పుడే భరతునకు వర్తమానము పంపింతమని యొక పత్రమున్ తక్షణంబుననే బయలు దేరవలెనని వ్రాసి భరతునకుం బంపఁ నా పత్రమున్ గొనిపోయిన నెంగిరివలన భరతుండది యందికొని చదివి శత్రుఘ్నా మనకు వచ్చు దుస్స్వప్నములకుఁ దోడి లేఖం జూచితివా యని యావచ్చిన వాని నేమిరా విశేషములని యడిగి యతనివలనం దెలియబడని వార్తై వెంటనే బయలు దేరి యయోధ్యాపుర సమీపంబునకు వచ్చిన నచటి ప్రజలెల్లరును నాడు భరతుఁడు రాతగిన దినమని చూచుచుండి యావచ్చు రథముపైనున్న వాఁడు భరతుఁడే.

మంజరులు.

౧॥ అనుకొనుచుండఁగ భరతుండపుడే । యరుదెంచి సోదరునితోన్
జననియైన కైకయింటికే తొలిఁ । జనుదెంచి విచారమునన్
౨॥ తల్లీ పురమి ట్లరాజకముగాఁ । దనరుచుం బొగులుచునుచు
యుల్లమున కెంతయో చింతఁ గొల్పు । చున్న కారణము వినుచు॥
౩॥ మని బెగడి యడిగినంతనె దుఃఖం బాకైకకినుమడించెన్
దనయుఁ డడవికేగి పతిస్స్వర్గము । గనుట మదిని యోజించన్॥

వ. దుఃఖముతో పాటు భయముంగూడ దోచుటయు శ్రీరామునిఁదలఁచుకొలది యాతని సద్గుణంబులు జ్ఞప్తివచ్చి పశ్చాత్తాపముగలుగుటయునై తోచియుండో చక నిట్లనియె.

ఉ॥ పాపిని దుష్టమానిసిని భర్తనుగంగనుగల్పనైన యీ
లోపముఁ గాడితిక్ శిశువులంగినురక్కసివంటిదాన నే
పాపమెరుంగనట్టి గుణవంతుని రాఘవు ఘోరకానన
వ్యాపకుగా నొనర్చితిని హా చెడుమంథరమాట నమ్మిటన్.

ముఖారి—ఆది.

ప॥ ఎంతపనిఁ జేసితిని । కాంతునిఁ బంపితిని సు

అ॥ మంతమైన నాపై నీకు । శాంతివలదో నాపుత్రక ॥ఎం॥

చ॥ పంతగించి రాముని నరణ్యమునకుఁ । బంపితి నేపరమనీచురాలను॥

2॥ పిపీలికము మొదలు బ్రహ్మవరకును । బ్రీతిపడు రాముని వనికంపితే

3॥ పాపిమంథరను నమ్మి నేనిటులు । భంగపడుదునని యోజింపనైతి

నాపుణ్యాత్ముని మదినెంచిననిపు డయ్యో నాహృదయము నీరగుచుండెను॥

4॥ బాలబ్రహ్మానంద వరదున కే । జేలా కనికారము లేదయ్యెను॥

ఉ. రాముఁడఖండ విక్రముఁడు రాజులనందగు రాజరాజు ని

ష్కాముఁడు సద్గుణాలయుడుఁ గల్మషమన్నది చేరనీడు పె

న్నేమముగల్గువాడతడు తక్కము విష్ణువె తెంగి దైవమా?

ఆమహనీయు నే నడవికంపితి నన్నిక సంహరింపుమా.

తే. పాలఁబోలిననామది పాడుమంథ

ర వచనములను చల్లఁజేర్పంగఁ దోడు

కొనుచుఁ బెరుగయి గట్టిచేకూరుకతన

బ్రేమయనియెడు చలనమే విడిచెనన్న.

తే. అనిన జననిపల్కులువిని నంతనె మది

తల్లడిల్లెను శూన్యమై ధరణితోచెఁ

భరతునకుఁ బ్రీతికలిగినభ్రాత తన్ను

విడిచి వనికేగ విరహమెవ్వడు భరించు.

మంజరులు

౧॥ పెద్దనిట్టూర్పు విడిచి భరతుఁడా । పైపైఁగను లెఱ్ఱఁజేసి

ముద్దుకొడుకు రాముడు నాకంటి యు । మోసపుచ్చితివటోసి॥

౨॥ నన్ను నాయన్న నెడఁబాపితివె య । నార్యపుత్రి నిన్నింక

నెన్ని యుగమ్ములకైన పాపిగా । నెన్నుదు నిది నిశ్శంక

వ. అనియు నిట్లు రాముని గానకంపినదో మూలకారణం బెఱుం
గ కిట్లనియె.

శ్రీరాగము — త్రిపుట.

ప॥ ఏలనన్ను శాసించితి । వెలుఁగఁ జెప్పవమ్మ కారణంబు
అ॥ పోలఁదగువాఁడేడీ రాముని । పుణ్యమూర్తిని ప్రేమమఱమాని॥
చి॥ బాలప్రాయమునుండియు నీ । పట్టినతెనెయుండెంగా నీ
లీలలలోనైన కౌసల్య ॥ బాలునివలెచూడఁడత డక్కటకట॥

చ. బుధుఁడగువాని సర్వగుణపూర్ణుని శేని జనానుకూలుఁ బె
న్నిధియగువాని శాంతమధుసీరధి నార్యమతానుచారినిఁ
సుధవిలుకంగఁ బల్కు ఘనసూనృతవాదిని యోధనాథు నే
విధముసఁబంపినావె యుపవిఁ జరియింపఁగ విందుఁ జెప్పవమ్మా॥

వ. అని మిగుల వ్యసనముఁ జెందుచున్న వానికిం జడియుచు-

తే, మాయమంథర దుర్బోధసేయుకతన
పృథ్విసీవేలఁజూడఁగఁ బ్రీతిపొసఁగు
రాజ్యమంతయునీకిచ్చి రామచంద్రు
ఘోరవనముల కంపింపఁ గోరుకొంటి.

వ. అనినక్షణంబుననే రోషభీషణుండై శత్రుఘ్నుండపోయి మంథ
రఁ జుట్టుఁబట్టి యీడ్చితెచ్చి భరతునిముందుఁబెట్టి తన్నుచుం
గ్రుద్దుచు

పాట.

ప॥ ఎవఁడుచెప్పెనే పాపీ యీ
అ॥ భువి భరతునికిమ్మని కోరఁగనీ॥ కై
చ॥ దున్నపోతువలెఁ దినితిరుగలేక
నిన్నురాచకార్యంబులఁ జొరుమని ॥ఎ॥

ఆ॥ పాడుముండ నీవంటి రండలన్
పజ్జనుంచుకొనుటయె మాతప్పె
యీడుబుద్ధి ప్రియయము నకౌసటను
నట్లుచేసినావే ఛీ ఛీ నీ ॥కె॥

వ. ఖడ్గముం దీసి జుట్టుంగోసి కంఠముసుత్తరింపం దలంపం భరతుండాపి సోదరా రామచంద్రుండు వినినదిది స్త్రీవధంబు దుండగంబని భావించి మనలం గోపించునేమో ఊరడిల్లుము స్త్రీలం జంపుట పాడిగాదని యాపి తాను కైకం గని యిట్లనియె.

ఉ॥ ఎన్నండు సూర్యవంశధరణీశులు పెద్దలుపేడి చిన్న వా రెన్నంగ రాజులైరిం గడుహీనపుగోరి కదేలంబుగ్గ నే నెన్నడుగాని నన్ను ధరణీశునిం జేయంగ గోరినా ననిన్ నిన్ను హరించి రక్కసిగనేని సృజింపక నిట్లు చేసెనే.

ఉ. ఇట్టులం దల్లినాడియతిం డిబ్బడిం బలికి రామరామ నే నెట్టుల నిన్ను గందు జనయిత్రికిం గోసలపుత్రి కెట్లు పోం గొట్టుము జంత, లక్ష్మణునకున్ మఱిసీకును సీతకున్ గటా యెట్టులం దండ్రి చావు వచియింపుదు నే నొకనీచజన్మునన్.

ముఖారి — మిశ్రగతి

ప॥ ఒడలువణకం జొచ్చం । దడబడె పదములు
రామచంద్రాం సద్గుణసాంద్ర ॥యొ॥

అ॥ అడియాసతో నీప । ట్టాభిషేకము చుం
పడిపడిం దలచితిం పసికేగుట లెరుంగను

మి॥ కడుప్రమోదమునం । గనుపరచియే
కైకనిన్నిటు । మోసగించెను
పుడమిలో నీపైన హితమును
బొంపకేవ్వరుం । గైకతప్ప ॥నొ॥

తే. అఖిలసద్గుణ కల్పకమైన నిన్ను
కాన కంపిన పాపిన స్గనుటకంటె
నీవుచగియించు తావులే నెలవులైన
మృగము సనుఁ గన్నచో బహుమేలుఁగందు.

సీ. అయ్యయ్యొ రామనీయంగుళీకమునైన
నీవేలియందుండ నేర్తునేమొ
శ్రీరామ నీనారచీర నేమైనచో
బహువిశుగ నుండఁబడుదునేమొ
గాండీవమై నీదుకరమున నున్ననే
నీ కుపకృతిసేయ నేర్తునేమొ
జగదేకవీర నీచరణభూషణమునై
యున్న నీచూడ్కులనుందునేమొ

తే. కడకు నీపదరేణువై గడియయున్న
పరమపావన తరియింపబడుదునేమొ
పుణ్యజన్ములు సౌమిత్రి, భూమిజాత,
అయ్యయో రామ నాబ్రతుకయ్యె వితగ.

వ. రామచంద్రా కైకపుత్రద్రోహి, పతిహంత్రి, పాపజాతి దీనినిప్పుడ ఖండించిన మాతృహంతకుఁడని నన్నుంగోపించి మాటలాడవేమో యని శంకింతునని లోనందలంచి కౌసల్యా సుమిత్రలకడకేగి మిగుల రోదనంబుసేయఁ గౌసల్య యబ్బరతు నీక్షించి భరతా?

క. నీకొఱకై యాసించియె
కైకనృపుని రాజ్యమడిగెఁ గావున వేగం
బేకమ్మ రాజరాజవు
శోకింపఁగనేల జననిచూచెదు ననఁగన్.

భాగేశ్వరి — రూపకము

ప॥ అమ్మనేను పాపజాతి । యందుఁబుట్టి నప్పటికని

అ॥ తమ్ముఁడనై రాఘుపుపా । దమ్ములఁగొలిచితిని గాన

మి॥ నమ్మవలయు నాదుమాట । నాయెడలం గరుణనుంచి

నమ్మకున్న నిప్పుడె పాపి । ణమ్ములనెడయుదును నిజ॥మ్మ॥

చ॥ అరయఁగ నభిషేకలక్ష్మి । కాసపడితినేనినేను

పురువులొడలఁబడిచచ్చెద । గురుహంతకులేగినట్టి

మి॥ నరకమేగువాఁడఁదల్లి । నాయెడ నీదయనుచల్లి

కరుణజూపుమిప్పుడెవెళ్ళి । ఘనునిరాముఁదెత్తుమళ్ళి ॥య॥

వ. అనుచున్న సమయంబునం భూతపంచకంబుంగూడ భరతుని వాక్యములు నిక్కంబని తెలుప నచటివారెల్లవారలకుం బొంగిపొరలివచ్చు దుఃఖముల నాచుటకై తగినమాటలనాడి వశిష్ఠుండు తైలంబున నుంచిన దశరథ కళేబరంబు నొద్దకుం భరతశత్రుఘ్నులం దోడ్కొనిపోయి చూప

సీ. కటకటా చక్రవర్తికినీకు నవ్యంబు

గా కర్మజేయ నొక్కసుతుడైన

దగ్గరలేకుండ దైవంబొనర్చెనా

మాకర్మమేమొ నీమరణకాల

మునను దులసితీర్థమును నోటనిడుటకు

నోచుకొనకపోతి మీచిలుగు స

మయమునందైననో ప్రియజనకా యటం

చెప్ప నల్పువ్వరమును యింటలేము

తే. చూడవాతండ్రి నేనొకసుతుడననుచు

నీకొరకు కొర్కమేచ్చి చిన్నిసుతుఁడిపు గో

కనుము నీకొఱకివిగొ కేకయక్షితీశుఁ

డరణమంపిన హారము లందికొనవ.

తే. కౌఁగిలించుకొనిన నాకుఁగౌఁగిలిడవు
రాఘవునకు నే గష్టకారణుఁడనని యు
మాతఁదీసి నేఁజూచినమాతనైతు
కన్ను లంతఁజూడఁగరాని కల్మషుండన.

వ. అనుచు మిక్కిలి దుఃఖించు భరతునోదార్చి భరతా కాలయాపన మొనర్పక నేఁజెప్పినవిధంబున నంబితృమేధం బొనర్పవలయు శాస్త్రార్థ సరణిననిన గురు (వశిష్ఠు) ని యాజ్ఞప్రకారంబు సువర్ణగజగోభూ వస్త్రాదిదానంబులొసంగి స్వర్ణవిమానంబున గంధపుష్పాదులతో నలంకరించిన రాజకళేబరమునుంచి సకలజనంబులు రాణివాసము వెనకనడువనముందగ్నితో భరతుండుశత్రుఘ్నసమేతుండై పోయివిధ్యుక్తక్రియంబుల నెఱవేర్చి తిలోదకంబులొసంగి యిలుసేరె ననంతర దినంబెల్ల మంత్రిజనంబులుండ వశిష్ఠుండు భరతునింగని భరతా రాజ్యం బరాజకంబుగా నుండందగదు నీవు పట్టాభిషిక్తువుకమ్మని న నతండిట్లనియె.

చ. పరమపవిత్రుఁడై యిటులఁ బామరురీతినిఁ బల్కుచుంటివో
గురువర! నీతియూనె గుణకోవిదురాఘవుఁ గానకంపి యీ
ధరణినియేలు టెంతటియధర్మపుఁ గార్యము కైకపుత్రుఁడై
బరగినతప్పుతప్ప నగుపర్చుము పేరొకతప్పునాయెడన్.

మంజరులు

౧॥ కావుననిపుడే పురమురక్షింపఁ । గలుగు నొకరులుతప్ప
నీవు ప్రయాణముసేయు మెల్లగవనిసుండి రమ్మనిచెప్ప॥
౨॥ నాతరంబయెల్లరముఁ బ్రార్థింప । నాతఁ డరుదెంచుననెడు
రీతిదోచుచుండెనన నెల్లరుం । బ్రీతితో వెడలిరపుడు॥

వ. సకలపరివారంబును రాణివాసంబును సైన్యంబునుం బయలుదేర భరతశత్రుఘ్నులాయెల్లపరివారంబుతో రామునికొఱకై బయలుదేరి

గంగానదిం జేరిరంత నటజనులు భరతునికి జయాజయధ్వనులు సేయు చుండంగ గుహుండు భరతునిసేననుంజూచి శ్రీరామునిపైకి దండెత్తి వచ్చుచున్నాడనియెంచి యాభరతునిదర్శించి.

బారువ—ఆది

ప॥ రామచంద్రు నడవికంపి రాజ్యమేలు చుంటివా
రమ్మ నీచంగతి జెప్పెదను । బరతరమ్మునీ॥

అ॥ యేమోయనుకొంటిని నీవింతటి కూరుండవా
భూమి ద్రోహము జేయుచుంటివా ॥రా॥

చ॥ పట్టవంత సాలకింకా । పాపమడివినున్న వారి
పైకి దండెత్తివచ్చు చుంటివా
దుట్టుడా నీగుణముదెలిసె । దూరముగ నుండుమదుగు
బెట్టనియ్యను నాపడవలో । నిన్నడుగు ॥బెట్ట॥

2॥ పుష్పమంటి జానికమ్మపోవుచుంటె । వనములోకి
బుద్ధిలేకపోయె । కటికుడా కనికారపు
దుష్పవర్తనగలుగు వారి । తోటిమాటలాడరాదు
దూరంబుగా నుండురాకుము ॥సాలాదూ॥

ఉ. ఇట్టులఁబల్కు నాగుహుని నెంతయుఁ బ్రీతిగ వీక్షఁజేసి హా
యెట్టిడునైన రామపదమెంతయు భక్తిని గొల్చుచుండఁగా
గట్ట మదీయజన్మమికఁ గాల్పనెయంచుఁ దలంచి యాగుహున్
గట్టిగ కౌఁగలించి కనికారముతోఁ పఁగ బల్కె నీక్రియన్॥

భాగేశ్వరి—చతురశ్ర.

ప॥ గుహుఁడా ! నాపైఁదయఁ జూపుము । క్రూరుఁడనుగాను నను మన్నింపుము ॥గు॥

అ॥ విహితధర్ముఁడగు రామచంద్రునిన్ । భీతిలేక నాతల్లివనికంపె ॥గు॥

1॥ సహజవిరుద్ధంబగు పనిమగిందు । చగలేదునేను కర్మమిటుచేసె ॥గు॥

2॥ నేను రామునకు ద్వేషినై న యెడ। దీవరక్షకునిపదముఁ దప్పినటు॥గు॥
3॥ రామునడవికంప నేతలంపన । రకంబందుదును ననుమన్నింపుము॥గు

క. అని వినయంబుగ బలికినఁ
గని భరతుని యాగుహుండు గడు భక్తిమెయిన్
వినయముతో సగిఁ దాటిం
చినఁ దానును యోగియయ్యె శృంగిపురమునన్.
తే. అన్న యచ్చోట జటదారియయ్యెనంచు
నెఱిఁగికొనియుంటఁ దానును ఋషిగమారి
యన్న మరలియింటికి వచ్చుటరసికాని
మరల నాగాచవేషముం బడయననుచు.

వ. ప్రీతినఁగావించి రాముడు లేగిన మార్గంబును గుహునివలనం దెలిసి కొని యాతని న్వీడిచిపుచ్చి భరద్వాజునాశ్రమముం జేరి యాతని వలన సీతారామలక్ష్మణులు చిత్రకూటంబున కేగినట్లుతెలిసిగి యమ్మునిగొద్ద శెలవుంగొని కడువేగంబునం జని చిత్రకూటారణ్య ప్రాంతమునకేగు నాసేనాధ్వనుల కలకలంబున కాసమీపంబునం గల్గు మృగములు నలుదెసలం బాఱుచుండం గొన్నిటిని శ్రీరామ చంద్రుడీక్షించి లక్ష్మణా జంతుసంతానమిట్లు సంతాపంబునొందు టకుం గారణమరయు మదిగాక నద్దెసం ధూళికప్పుటకుం గారణ ముంగనుమన లక్ష్మణుండా సమీపమునంగల 'యుత్తాలపాదపము' నెక్కి యుత్తరదిశనుండి చతురంగబలయుతుండై సూర్యవంశజుల బిరుదపతాకములతో వచ్చునతఁడు తమ్ముబట్టవచ్చు భరతుండని భావించి పిడుగువడినట్లా చెట్టునుండి పర్వతమున నన్నసమీపము నందూఁకి యన్నతో నిట్లనియె.

క. భరతుఁడు శత్రుత్వముతో
సరుదెంచుచు నుండె మనల సరికట్టుటకై
ధరియింపఁ జాల నిప్పుడే
బారిగొందును వాని ప్రాణములు శలవిమ్మా.

క. అన! నీవనఁ జెజుపన్వు, మునుకే
నను విడువనివాఁడనయ్యు నాయెడ భరతుం
డనురాగయుతుఁడొ? ద్వేషియొ?
కనిపెట్టఁజాల నైతిగా యేమందున్—

వ. నీకుఁ గోపము మెండుగాఁ గల దద్దియణంచినఁగాని దూరమాలోచించు స్వభావము కలుఁగదు. భరతుండు నన్నయోధ్యకుం గొనిపోవ వచ్చుచున్నాఁడు శాంతుఁడవు గమ్మన లక్ష్మణుండు లజ్జఁగలిగిన వాఁడై యూరకుండె ననంతరంబు భరతుండు సర్వసేనను రాణివాసమును గురులను మంత్రులను దూరంబుగా విడియించి, శత్రుఘ్న సమేతుండై రాముని పర్ణశాల జాడనేఱింగికొనినవాఁడగుట నలుదెంచుచు దూరంబునుండి యాపర్ణశాలంజూచి—

చక్రవాకము — జుల్వా

ప॥ అయ్యయ్యో నేనెంతపాపి । నైతిఁ గైకసుతుఁడ నగుట
అ॥ నియ్యెడ శ్రీరామచంద్ర । సీతాసతిం జూడవలెనె
చ॥ శయ్యయయ్యో నేల దుంప । లయ్యోఁ బంచభక్ష్యంబులు
నయ్యయ్యో మణిమందిర । మయ్యో నాకు పాకినల॥

మంజరులు.

1॥ అకటకట చిక్కిపోయియున్నా । రన్నయు స్వామిచూడు
యెక్కడికీనేగి వారివదనముల । నీక్షింపఁగలను నేఁడు॥
2॥ అనుకొనుచు నోరాలేక యేగి రా । ముని పాదములకు మ్రొక్కి
జనకజాతకున్ మ్రొక్కి లక్ష్మణుని । సందిటం గ్రుచ్చి వెక్కి॥

వ. ఏడ్వసాగిన భరతశత్రుఘ్నుల వలన దశరథుని మరణవృత్తాంత

ముల దెలిసికొని సీతారామలక్ష్మణులు దుఃఖించుచు నాసమీపంబు
నంగల మునులవలన నాశ్వాసింపఁబడి రందు రాముండు—

చ. అనయము రామరామ యను చత్యబధికంబగు ప్రేమఁబెంచుచున్
మనమున నేను సర్వమని నమ్మికఁబొంగిన నీబుణమ్ముఁ దీ
ర్పనయితినంచుఁ జింతనడ భవ్యచరిత్రి! త్వదీయ కర్మనై
ననునెటువేర్పఁ జాలని యనార్యునిగా ననుసేయ జెల్లునే.

చ. భరతుడె నీదుకర్మ సలుపందగు పుణ్యమునందిపుట్టెఁ దా
నరయఁగ కొంతముందు జనకా! ననుగన్న ఫలంబదేది సం
బరపడినావు వృద్ధతనుబాలురుచేతికి వచ్చిరంచయో
తరుణమునందు లేనిది వృథాగద యెట్టిఫలంబయేనియున్.

వ. అని మిగుల వగంబొగిలి సీతాలక్ష్మణ సమేతంబుగా కృతస్నానుండై
తిలోదకాది కర్మకాండనెల్ల గంగానదీ తీరంబునం జరిపి పర్ణశాల
కేతెంచం గౌసల్య జానకం కౌఁగలించికొని, యమ్మా! జనకుని పుత్రి
కవై, దశరథుని కోడలవై రామపత్నివై యిట్టికష్టములం బొందితి యరం
ణ్యవాసివి కావలసివచ్చెఁ గర్మనెవరు గడుపఁగలరని మిగుల దుఃఖిం
చుచుండ దత్సమీపమునం గల గురుడగు వశిష్ఠ కోసలరాజులగు జనకు
వారలనూరడించి యొక్కచో నెల్లరుం గూర్చుండిన భరతుండు
రామచంద్రునివంకం దిరిగి నిలువంబడి యిట్లనియె—

మ. ధరణీపాలనఁ జేయజాలు ప్రభుడత్యంతంబు శ్రీరామభూ
వరుఁడేయంచు సమస్తలోకములు మోదింపన్ సజ్జనుల్ వల్కనో
ధరణీశాధిప క్లిష్టసంశ్లేయయి సంతాపంబుతోఁ దండ్రి పెం
పరి మాటాడిన నీవు నంతరివిధ న్నా! సేయుటల్ పాడరా.

కాఫి—జల్పె

ప॥ నామనవిని విసదయును । న్నాదరింపు మాజనముల్
అ॥ రామచంద్రుఁడే ప్రభుఁడై । రాజ్యమేలఁ గందుమందు
చ॥ నరకమగును నీవులేని । ధరణియెల్ల నాదుతల్లి
పరమపాతకియె కాక । బ్బంగి సలుపునా తలఁపగ॥

శ్రీ గ్రంథాలయము

తే. ధరణిఁ బాలించి పుణ్యంబుఁ భరతుఁడుమరి
మునుల సేవాఫలంబు రాముడును దెచ్చి
పెంపుసేతురు సూర్యవంశంపు ప్రతిభ
యని తలంచి యిట్టులొనర్చె వినుము భరత.

వ. కావున నోభరతా మనకన్నఁ బెద్దలొనర్చు కృత్యంబు లనుభవిష్యాల ముకాక మనకు మఱియొకరీతిం దోచుచుండుం దడయక నీవు రాజ్యముం బాలింపుచుండుము పదునాల్గువత్సరంబులునుం బితృవాక్యపాలనం బొనర్చి వచ్చెదననిన భరతుండు వెండియు నిట్లనియె —

శా. ఓంకారంబవు నీవు శంఖమును నేనోదేవ! ముల్లోకముల్
శంకాతంకము లేక నేలు రవివీశా! నీవు నేదివ్వె నే
వంకన్నీకు సమర్థమైన యది నేబాలింప నర్హంబు నా
వంకన్నీదు కృపాకటాక్షమును జూపన్ రమ్ము భూజానిగా॥

తే. కాకయుండిన లక్ష్మణుఁగాచినట్లు
నన్ను గావుము నీచెంతనఱికియుండ
నట్లుకూడ మన్నింప నటంటి వేని
చూడు ప్రాయోప వేశంబు నేడుసేతు.

వ. అని ప్రయత్నించు భరతుని వశిష్ఠుండాపి యో రామచంద్రా! భరతుం డత్యంత ప్రియసోదరుండె కాక నీకుఁ బ్రియభక్తుండుఁ గావున నీపాదుకల నొసంగిన వానిని సింహాసనంబున బెట్టిపూజించుననిన —

సీ. రామచంద్రుఁడు గుణోర్వ్యాన్వయం విశేషత
యని పాదుకలు భరతునకు నిచ్చి
తమ్ముఁడా ముప్పురు తల్లులఁ సమదృష్టి
గొల్చుచుండుము భక్తిగురుల యెడలఁ
జూపుచుం బేదలఁ గాపాడుచుండుము
జనుల యందఱియెడ సమతఁ బ్రేమఁ

బరపుచుండుము నాల్గుపాదంబులును ధర్మ
ము నడచునట్లులం గొనముగలిగి
తే. పతిఁ లఁగవలె జనుల యవస్థలెఱిఁగి
కాచుచుండఁగవలె సర్వకాలములును
సీఘ్రిమేపోయి రమ్మనఁ జింతతోడ
రాముఁ డాగ్రిహించునని భరతుండు భక్తి.

మంజరులు.

1॥ సీతారాములకు నమస్కారము । జేసి లక్ష్మణునిఁ బిలిచి
యేతీరున వదినెకన్నకుసేవఁ । జేతువో యని కడువిరిచి
2॥ మంచిమాటలను రామపాదుకల । మస్తకంబున నిడుకొని
యెంచి రామభద్రులోన జైపర । మేశ్వరాయని ఘని విని
3॥ సర్వసేనతో గురులతోఁ గూడఁ । జనుచు రాము మరలగని
నిర్వివాదాంశమే గడుపుదాటె । నేని నేనుబ్రిదుకనని
వ. చెప్పి జననులాది సర్వపరివారముతో రామభద్రు వీడ్కొని భర
తుండుఁ బ్రియాణామై శతృఘ్నజయుంబను పట్టపుటేనుంగుపైఁ గల
యంబారీలో నాపాదుకలుంచి, రఘుపతిరాఘవ రాజారాం.
మ. అని భక్తింగొనియాడుచుం బురికి నాయాదోటులం దొల్లివా
ర్వినఁగాఁ జెప్పుచుఁబోయి పాదుకలకు న్వేపట్టముంగట్టి రా
ముని వీడ్కొన్న యయోధ్యనుండననియాపుణ్యుండుశతృఘ్నునిఁ
గనుచుండంగడె రాజ్యమంచుఁ దనయన్నన్ గొల్చుచున్ భక్తితోన్
వ. అయోధ్యాపురంబున నుండనొల్లక సమస్తమంత్రులపై భారంబుంచి
వారలయనుమతంబున నందిగ్రామంబున వసియించె నప్పాదుకా
ప్రిభావంబున సర్వజనంబులు సుఖంబుగా నుండిరి.

ఇది శ్రీ బాలకళాసిధి కౌమార్మారి బాలబ్రహ్మానందకృత
శ్రీరామకథాలహరి అయోధ్యాకాండము
సంపూర్ణము.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA1808 170 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Hasin |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |